1950 లో మిక్కుటమైన ధనమార్జించిన చిత్రము !

అనేక
కేంద్ర
ములలో
జూబిలీ
ప్రదర్శన
ముల
నందు
చున్నది

ఆర్.కె. ఫిల్మ్స్

# బర్సాత్

ప్రొడ్యూసర్ డైరెక్టర్

## రాజ్‌కపూర్



**21-7-50** మొదలు

శ్రీ సరస్వతి - విజయవాడ

**24-7-50** మొదలు 2-వ వారము

| | |
|---|---|
| ప్రభాత్ - బళ్లారి | రౌనఖ్ - కడప |
| చాంద్ - కర్నూలు | రఘువీర్ - అనంతపురం |
| వసంత్ - ఆదోని | ప్రెస్ - హనుమకొండ |

29-వ వారం - దిల్షాద్ - హైద్రాబాద్
13-వ వారం - సరస్వతి - మద్రాసు
3-వ వారం - వినాయక్ - నెల్లూరు

**28-7-50** మొదలు

సత్యనారాయణ - తెనాలి
సరస్వతి - గుంటూరు
మినర్వా - విజయనగరం
అశోక్ మహల్ - రాజమండ్రి
పాండురంగ - ఏలూరు

చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక బొమ్మల పజిలు, ముగ్గులు, చిక్కు బొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు.1.

*Read & Advertise ...*

# CHANDAMAMA

**(TELUGU, TAMIL, KANNADA & HINDI)**

*THE MAGAZINE FOR THE MANY*



**The Only Magazine Identically published in Four Languages**



**Sold to 84,000 Homes a Month**



*ADVT. RATE FOR GROUP PAGE*

*Rs. 350/-*



*For Further Details:*

**ADVT. MANAGER**

**Chandamama Publications**

**P. O. Box 1686 :: MADRAS-1**



## డోంగ్రేగారి

### బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టిదాయకము. పండ్లు వెలువడేటప్పుడు అయ్యే వికారములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY - 4

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.

# మంచి మంచి పుస్తకాలు

## చలంగారి రచనలు:

| | | |
|---|---|---|
| శ్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| మంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| సత్యం, శివం, సుందరం | | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| కర్మభూమిలో కాళింది | [కథలు] | 1- 8-0 |
| కప్పిటికాలవ | ,, | 0-12-0 |
| పాపం !!! | ,, | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | ,, | 1- 0-0 |
| అమీనా | ,, | 1- 0-0 |
| వివాహం | ,, | 1- 0-0 |
| బ్రాహ్మణీకం | ,, | 0-12-0 |
| అరుణ | ,, | 0-12-0 |
| హంపీకన్యలు | ,, | 0-12-0 |
| అదృష్టం | ,, | 1- 0-0 |
| వాళ్ళు వలుగురూ | ,, | 0-12-0 |
| పురూరవ | నాటకం | 1- 8-0 |

## వివిధ రచయితలు

| | | | |
|---|---|---|---|
| ఈస్టలిన్ | [నవల] | | 2- 0-0 |
| చచ్చిపోయిన మనిషి | [పద్మరాజు] | నవల | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం-టు-లెట్ | [బాలకృష్ణశాస్త్రి] | .. | 0-12-0 |
| సిపాయికథలు | [శిష్ట్లా] | ,, | 0-12-0 |
| మూగజీవాలు | [గోఖలే] | ,, | 1- 4-0 |
| రాజా-మంత్రి | [యం. యస్. మూర్తి] | | 0-12-0 |
| తుక్కా-లా గీతలు | ,, | ,, | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| వెలపు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | .. | | 1- 0-0 |
| సంజీవి | [ధనికొండ] | కథలు | 1- 0-0 |
| గర్వభంగం | .. | ,, | 1- 0-0 |
| ప్రియురాలు | .. | ,, | 1- 0-0 |
| తీర్పు | ,, | కథలు-నాటిలు | 0-12-0 |
| పవిత్రులు | ,, | దృశ్యనాటిక | 1- 4-0 |
| ఎర్రబుట్టలు | ,, | దృశ్యనాటికలు | 1- 8-0 |
| కళ్యాణి | [సోమంచియజ్ఞన్నశాస్త్రి] | నాటకం | 0-12-0 |
| ఐశ్వర్యంపెళ్ళి | .. | .. | 0-12-0 |
| జ్యోతిర్మయి | [అ. వెం. సత్పు] | .. | 1- 0-0 |

# గ్యారంటీ స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలు

**మాసిపోవు, ఎప్పుడు కాంతిగా నుండును. చౌక, అందమైనవి.**



లోటాలు, డబ్బాలు, టిఫన్ కారియర్లు, కప్పులు, అడుగుసెట్లు, స్పూన్లు, ప్లేట్లు పచ్చడికిన్నం సెట్లు, జెల్లిగంటెలు, అన్నకుట్టి వగైరా ప్రతియింటికి, హోటలుకు కావలసిన పరికరములన్నియు దొరకును. ఇవి వ్యాపారస్తులందరివద్ద దొరకును




మా షోరూమును సందర్శించండి

498, మింట్ స్ట్రీట్, మద్రాసు - 3

తయారుచేయువారు

**ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్**

498, మింట్ స్ట్రీట్ :: మద్రాసు - 3

---

# రు. 500 బహుమానము

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

**ఉమా మహల్ :: మచిలీపట్నము**

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.





















అసలు బంగారు రేకు లోహము పైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటీ.

• • •

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారపు రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు యిచ్చియున్నారు. 800 డిజయినుల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్సిలు చార్జి 0-15-0 మాత్రమే అగును.

Tel: "UMA" MASULIPATAM.



# అట్టమీది బొమ్మ

కంసుని అజ్ఞ ప్రకారం అక్రూరుడు వెళ్ళి కృష్ణ, బలరాములను మధురా పుర పొలిమేరకు తీసుకవచ్చాడు. 'అక్రూరా!—మేము ఇక్కడనే వుంటాము. నీవు మీ రాజువద్దకు పోయి, మా రాకను గురించి చెప్పు' అంటూ, శ్రీకృష్ణుడు అతనిని పంపివేసి, అన్నతోసహా నగరం చూడబోయాడు. ధనుర్యాగంకోసం ప్రత్యేకించి చేయబడిన ఆ మధురాపట్టణపు అలంకారాలు, అందచందాలు కృష్ణ బలరాములను ఎంతో అకర్షించినై. వారు అలా వీధుల వెంబడి వెళుతూవుంటే, పురజనులు వారిని రెప్పవాల్పక చూడసాగారు.

కృష్ణ బలరాములు ఊరంట తిరుగుతూవుండగా దారిలో బట్టలమూట బుజాన వేసుకుని వస్తున్న ఒక చాకలివాడు తారసపడ్డాడు. వాడిని కుశల ప్రశ్నలు వేసేసరికి, 'నేను కంసమహారాజావారి చాకలిని' అన్నాడు. ఐతే మాకు కొన్నిదుస్తులు ఎరువియ్యి. మేము రాజుగారిని చూడబోతున్నాము. వారి దర్శనం చేసుకవచ్చి, బట్టలు మళ్ళీ నీకిచ్చివేస్తాము' అన్నారు వారు. చాకలి పెంకిబిగిలు బిగిలేసరికి, కృష్ణుడు ఆ దుర్మార్గుణ్ణి ఒక్క దెబ్బతో హతమార్చి మూటలోని దుస్తులు ఇష్టమొచ్చినన్ని తీసుకుని, తక్కినవాటని వీధులో పేదవాళ్లకు పంచిపెట్టాడు.

మరికొంచెం దూరం పోయేసరికల్లా ఒక అందమైన చిన్నది ఎదురైంది. కాని పాపం, అమెకు గూని ఉండటంవల్ల ముఖం దించుకొని విచారంగా వుంది. ఆమె వాలకం కనిపెట్టిన మాయల కృష్ణుడు 'నీ వెవరవు'? అని ఆమె నడిగాడు. "నేను కంసమహారాజుగారి అంతఃపురంలో పరిచారికను. రాణిగారికి గంధం పట్టుక వెళుతున్నాను" అంటూ, ముద్దుకొద్దీ కృష్ణుని ఒంటికి ఇంత గంధంతీసి పూసింది. కృష్ణునికి జాలికలిగి, తన చేతులతో ఆమె వీపు తాకేటప్పటికల్లా ఆ దాసీగాని గూని ఎక్కడి దక్కడనే మాయమైంది. ఆమె చెప్పలేని ఉత్సాహంతో తన జన్మ తరింపజేసిన శ్రీ కృష్ణ బలరాములను అతిధులుగా ఇంటికి తీసుకపోయింది.

ఈ విధంగా మధురానగరిలో సోదరులిద్దరూ అనేకమందిని తరింపజేస్తూ అందరిమధ్యనా అల్లారుముద్దుగా మెలగుతూ వచ్చారు.

# చందమామ

## పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

16 పైసలు

చందమామ ఇంతవరకు

వీరలక్ష్మి, వర్ధమానుని విదేశయాత్రలు, దొంగసన్యాసి, పాపిష్ఠిముఖాలు, బాలనాగమ్మ, తండ్రి-కొడుకులు, ఐదుప్రశ్నలు అనే ఏడు సీరియల్ (పెద్ద) కథలను మీకు అందజేసింది. వీటిని చాలామంది చదివి హర్షించి, ఒక్కొక్క కథను పుస్తకరూపంగా ప్రకటించమని కోరగా, ముందు 'తండ్రి-కొడుకులు' కథను అలానే ప్రకటించి వున్నాము. దీనిని చందమామ పాఠకులు అప్యాయంతో అందుకుంటూ తక్కినవికూడా పుస్తకరూపంలో ప్రచురించమని పదేపదే వ్రాస్తున్నారు. మా చదువరుల కోరిక నెరవేర్చటానికి ముందు, ఈ పెద్ద కథ లన్నిటిలో వారికి ఏ కథ ఎక్కువగా నచ్చిందో తెలుసుకోదలిచాము. కనుక, ప్రకటితమైవున్న 'తండ్రి-కొడుకులు'గాక, తక్కిన ఆరు పెద్ద కథలలోనూ వాటి వాటి స్వారస్యాలనుబట్టి, ఏకథ ఎక్కువగా నచ్చిందో తెలుపవలసిందని మా పాఠకులను కోరుతున్నాము. మీ సలహాలు మాకు చేరగానే, ఎక్కువమంది ఏ కథను కోరుతారో దానినే పుస్తకముగా ప్రకటించి మా చదువరుల అభిలాషను తీర్చటానికి ప్రయత్నిస్తాము. మీ అభిప్రాయాన్ని ఒక కార్డుపైన యిలా వ్రాయండి — "చందమామలో ప్రచురించిన పెద్దకథలన్నింటిలో నాకు '..........................' అనే కథ ఎక్కువగా నచ్చినది."

మీఅడ్రసుకూడాయిచ్చి, కార్డు ఈ చిరునామాకు పంపండి.

'చందమామ ఆఫీసు' — ప్రచురణశాఖ,
పోస్టుబాక్సు 1686, మద్రాసు.



సంపుటి 7
సంచిక 2

ఆగస్టు
1950





# పేదరాలి పెన్నిధి

జర్మన్ దేశపు రాజు కైజరొక
రోజు షికారుకు వెళ్ళాడు,
త్రోవలోన నొక దిక్కు తెలియని
చక్కని బాలుని చూచాడు ;

'అబ్బాయీ ! నీవెందుకలాగా
నిలుచున్నావ'ని అన్నాడు.
'మీరేనా డాక్టరుగార'ని ఆ
పిల్లడు ఆయన నడిగాడు.

'నీకెందుకు డాక్టరు ? అబ్బాయ్ !' అంటూ
కైజరు ప్రశ్నించా డతని.
'ఇంటివద్ద మా అమ్మకు చాలా
జబ్బుగ ఉం'దన్నా డతడు.

'అయితే చూదాం, పోదాంపద మీ
ఇంటికి' అన్నాడా రాజు,
పిల్లాడన్నా డపుడు 'పేదలం
ఇవ్వలేము మేం మీ ఫీజు.'

'ఫరవాలేద'ని' రాజు వెంటనే
బాలుని ఇంటికి వెళ్ళాడు;
బక్కచిక్కిన మంచం ఎక్కిన
పేదరాలి నట చూచాడు.

'అబ్బాయీ ? ఎక్కడికెళ్ళా'వని
అన్నది కొడుకును గని జనని,
'ఇడిగో నీకు మందిచ్చేందుకు
తెచ్చానమ్మా డాక్టరుని.'

రచన:
'బైరాగి'

ఆ బాలుని మాతృభక్తికై
కైజరు సంతోషించాడు,
కూర్చుని ఏదో వ్రాసి కవరునం
దుంచి పిల్లనికి ఇచ్చాడు.

'అబ్బాయీ! భయమేమీ లే'దని
బుజ్జగించి మరి వెళ్ళాడు;
మందుల చీటీ అనుకొని పిల్లడు
షాపుకి పట్టుక వెళ్ళాడు.

అక్కడ చీటీ చూచి అందరూ
విస్తున మూర్ఛలు పొయ్యారు,
'రాజు సంతకపు బ్యాంకిచెక్కు. ఇది
ఎవరిచ్చార'ని అన్నారు.

పిల్లవాడు కథఅంతా చెప్పగ
వారాతని దయతలిచారు,
ఆ చెక్కును మార్పించి పిల్లనికి
మొత్తమంత ఇప్పించారు.

డబ్బు వెంబడే మందులొచ్చినయ్
డాక్టరుగారూ వచ్చారు,
జబ్బుపోయి ఆ తల్లీ కొడుకూ
ఎంతో సుఖముగ నున్నారు.

పేదరాలి పెన్నిధి ఆ పిల్లడు
శుభ సద్గుణములు గలవాడు;
సద్గుణ సంపన్నుని కెవడైనా
తప్పక సాయం చేస్తాడు.



# రోకంటి పాటలు

[ సేకరణ: వడ్లమూడి గోపాలకృష్ణయ్య ]

మేనత్త కొడుకనీ మెచ్చేదా ?
మట్టెలా కాళ్ళతో తన్నేదా ?

*　　*　　*

అప్ప కొడుకా ! రార ! అబ్బాయి రార !
అడవిలో మీ బాబు అలిసిపోయాడు
చెల్లి కొడుకా ! రార ! చేమంతి రార !
చెరువులో మీ నాన్న చెదిరిపోయాడు-

*　　*　　*

నే నొక్క చోటాన వియ్యమండితిని
వినుకొండ పట్నాన దూర బారాన-

*　　*　　*

చీకటిల్లూ రెండు ఓవ్యాలు గోరు
సిరిపట్టి మంచాలు అల్లుళ్ళు గోరు
అల్లుడల్లు దంచేను ఒల్లు మండేను
అల్లుడు తెచ్చిన చీర ఒల్లు నిండేను-

*　　*　　*

మాబావ గెడ్డమ్ము బైర గెడ్డమ్ము
ఈరుండు పేనుండు ఈత ముల్లుండు
పాయిప్పి చూచితే పందికొక్కుండు-

*　　*　　*

మా వదిన కన్నారు మాల మాదిగలు
మా వదిన కంపేరు మల్ల ఓప్పాలు
మా వదిన కంపేరు మల్లఓప్పాలు
మన్నయ్యకంపేరు కిఱ్ఱు చెప్పుల్లు-

పుట్టిల్లు పుట్టిల్లు అందురే గాని
పుట్టింటి కంటేను పురుషుడే మేలు
పండగా పనిరోజు లుండదనగానె
పలుకరే కన్నారు పగలేమొ గాని
వారి పగలు సూసి పడ్లెంత బోసి
దంచిన కన్నారి ధాన్యరాసుల్లు-

*　　*　　*

కొమ్మనిమ్మాపండు కోలారగించు
కొడుకు తెచ్చిన పండు తల్లారగించు
తాటిపండు నోటికి తగిలించరాదు
తనకైన పెనిమిటికి ఎదురాడరాదు
ఈ పండు నోటిని కెకలించరాదు
వియ్యాలవారిలో మాటపడరాదు

*　　*　　*

నిమ్మచెట్టూక్రింద అన్నకూర్చోని
వేపచెట్టూ దగల వేసె బొంగరము

*　　*　　*

కోడలా కోడలా కొడుకు పెళ్లామ !
పచ్చిపాలమీద మీగడేదమ్మ ?
వేడిపాలామీద వెన్నయేదమ్మ ?
అత్తలో ఓయత్త ఆరెళ్ల అత్త
నీవెక్కడత్తవే యీశ్వరుడిగిత్త ?




# శింగినాదం-జీలకర్ర

సుమారు రెండువందల ఏళ్ళ క్రింపట మన దేశమంతా చిన్న చిన్న రాజ్యాలుగా వుండేది. ఒక్కొక్క రాజ్యాన్ని ఒక్కొక్క రాజు పరిపాలించుతూ ఉండేవాడు. ఐతే, ఈ రాజులలో ఒకరికీ ఒకరికి మధ్యని ఎప్పుడూ కయ్యాలూ కొట్లాటలే కాని, ఐక మత్యం అనేది లేనే లేదు. ఇద్దరు కయ్యమాడుకుంటున్నారంటే వేలెట్టిచూపటానికి మూడోవాడికి వీలవుతుందికదా ?— అదే విధంగా జరిగింది మనదేశపు రాజుల విషయంలోకూడా. అది ఎలా జరిగిందీ అంటే ;

వర్తకం చేసుకుంటామని చెప్పి, మూడువేల మైళ్ళ దూరానవుండే తెల్ల దొరలు సీమనించి మనదేశానికి వచ్చి దిగారు. వారు మన రాజులను ఆశ్రయించి తమ అభిలాషను వెల్లడించేవరకు 'సరే, దానికేముంది. అలాగే చేసుకోండి' అంటూ మంచి మనస్సుతో మన రాజులు వాళ్ళకు వెంటనే అనుమతి ఇచ్చారు.

దొరలు వర్తకం సాగిస్తున్నట్టే వుండి, మన రాజులు జగడమాడుకోవడం కని పెట్టారు. 'బేష్, బాగానే వుంది. ఈ హిందూదేశపు రాజులు అవివేకులలాగా కనపడుతున్నారు. వాళ్ళలో వాళ్ళకు పడక చస్తున్నారు. ఈ అదునులో మనం వాళ్ళ జగడాలు వృద్ధిచేసి, వాళ్ళను చీలదీసి, ఒకమాటు ఒకరిపక్షం ఇంకొకసారి మరొకళ్ళపక్షం ఉన్నట్టు నటించి నాటకం సాగిస్తే, రెండు పక్షాల వాళ్లూకూడా మన పాలబడి, మనకు లొంగి వుంటారు. అప్పుడు వాళ్ళ రాజ్యాలను లాక్కొని, మనమే పరిపాలించుకోవచ్చు. ఈరాజు లందరూ మన చేతికింద కీలుబొమ్మలై చచ్చినట్టు పడివుంటారు' అని ఆలోచించుకొన్నారు.



ఈ నెల బహుమతి పొందిన సామెతకథ — సేకరణ : అడపా. ముక్తాబాయి, కాజీపేట

* ఈమెకు బహుమతిగా ఒక చక్కటి ఫౌంటెన్ కలము పంపుతున్నాము.



వాళ్ల ఆలోచనకు తగినట్టుగానే అన్నీ అనుకూలంగా అమరిపోయినై. మనదేశపు రాజులను చీలదీసి, ఒకళ్ళను ఒకసారి, రెండవ వాళ్ళను ఇంకొకసారి చేరదీసి, వాళ్ళతోనూ వీళ్ళతోనూ కూడా 'మీకు వచ్చినభయం ఏమీలేదు. మేము ఉండగా మీకు అపజయమేమిటి?' అంటూ వాళ్ళకు పురి ఎక్కించ నారంభించారు.

అందుచేత ఇప్పుడు, రాజులలో ఎవరికి ఏపాటి శత్రుభయం కలిగినా వెంటనే పోయి రక్షకులలాగా కనపడే తెల్లదొరలను ఆశ్రయింపజొచ్చారు. వీరు పోయి 'బాబూ! మీరేగతి' అని ప్రాధేయపడేసరికల్లా దొరలు తమకు ఇష్టంవచ్చినట్టుగా షరతులు బిగించి వాళ్ళను కక్కుల కళ్లెంలో పెట్టి నొక్కి వుంచేవారు.

రానురాను రాజులనందరనూ ఈ విధంగా లొంగదీసుకొని, చివరకు ఒక్కపని చేశారు. 'మీ రాజ్యంలో ఇప్పుడు ఉంటూ వున్న సైన్యాలను తీసివేయాలి. వాటికి బదులుగా మా తెల్లసైన్యాలను పెట్టి పోషించాలి' అని నిరోధించారు.

మన రాజులు చేయగలదేమున్నది? 'అలాగే పోషిస్తాం' అంటూ తల ఒగ్గక తప్పిందికాదు.

ఇలా తెల్లదొరలు, ముందు వర్తకానికని వచ్చిదిగి మూడడుగుల జాగాలో వుంటూ, చూస్తూవుండగానే ముప్పయికోట్ల మంది గల హిందూదేశాన్ని పాలించే ప్రభువులై కూర్చున్నారు.

సరే, మన రాజులు దొరల ఆశ్రయం పొందారు. తీరిపోయింది. మరి వాళ్ళ వాళ్ళ రాజ్యాలలో ఉంటూవుండే సైన్యాల మాట యేమిటి? వాళ్ళను తీసివేసి, తమ తెల్ల సైన్యాలను పెట్టారే దొరలు? తొలగింపబడిన సైనికుల బ్రతుకు తెరవు ఎలాగ?

ఈ ప్రశ్నలకు ఎవరూ జవాబు చెప్పే వారు కనపడలేదు.

అప్పుడు ఈ సైనికులందరూ కూటంగా చేరి, ఊళ్ళమీదపడి దోచుకోవటం వృత్తిగా పెట్టుకున్నారు. ఈ దోపిడిగాళ్ల ముఠాలనే పూర్వం పిండారీ దండులని పిలిచేవారు. వీళ్ళు సైనికులుగా ఉన్నంతకాలమూ అదుపూ ఆజ్ఞా వుండేది. కాని ఇప్పుడు అంతా స్వేచ్ఛ. అందుకని, పండిన పంటలు దోచుకోవటం, పశువులను తోలుకపోవటం, కొంపలు తగలబెట్టటం, నగా నట్రా—సరకు సప్పరా ఎత్తుకపోవటం, ఎవరైనా ఎదిరిస్తే వాళ్ళను తన్ని హింసించటం—ఇలా ఇష్టమొచ్చినట్లా సంచరించేవాళ్లు. వాళ్ళు ఇట్లా సంచరించటంలో పట్టణా లన్నీ పాడైపోజొచ్చినై.

పిండారీలు వృత్తిచేత దొంగలేకావచ్చు. అనేకవిధాల వాళ్ళు, పొట్టకూటికోసం పట్టణాలు నాశనమే చేయవచ్చు. ఐనా, వాళ్ళు ఇంతకుముందు సైనికులుగా ఉన్నందువల్ల ఆ అలవాటును బట్టి ఇప్పుడు దోపిడీ వృత్తిలోకూడా ఒక పద్ధతీ, నియమమూ అనుసరించేవాళ్ళు. ఆ నియమంకూడా చాలా చిత్రంగా వుండేది.




వాళ్ళు దోపిడీకి బయల్దేరేముందు 'శృంగనాదం' చేసేవారు. 'శృంగ'మంటే కొమ్ము. 'నాదం' అంటే శబ్దం. 'శృంగనాదం' అంటే కొమ్ముబూరా వూదగా విన పడే ధ్వని. ఈ శబ్దం 'అదుగో, పిండారీలు వస్తున్నారు సుమా! మీ జాగర్తలో మీరుండండి' అని గ్రామస్థులకు హెచ్చరిక చేయడమన్నమాట. అందుచేత కొమ్ముబూరా వినపడిందీ అనేసరికల్లా ప్రజలు హాహాకారాలుచేస్తూ అడవులంబట పరుగుతీసి ప్రాణాలు దక్కించుకొనేవాళ్లు.

ఇదేసమయంలో ఇంకొక గమ్మత్తు జరిగింది. జీలకర్ర మొదలైన దినుసులు

అమ్ముకోవటానికని విదేశాలనుంచి మన దేశానికి వర్తకులు వచ్చేవాళ్ళు. వాళ్ళలో ఒకవింత అలవాటుంది. తాము వచ్చి నట్టుగా ప్రజలకు తెలుపుడు చేయటానికని వాళ్ళుకూడా ఒకవిధమైన కొమ్ముబూరాతో శబ్దం చేసేవారు.

ఊరిబయట కొమ్ముబూరా వినిపించే సరికల్లా అది పిండారీ దొంగలు చేసే శబ్దమో, జీలకర్ర వర్తకులు చేసే శబ్దమో అమాయిక ప్రజలకు తేడా తెలియక, ఏ శబ్దం వినపడినా దొంగలే అనుకుని నిం:చున్నపాటున పరుగుచ్చుకునేవాళ్ళు.

గ్రామంలో కాస్తంత తెలివైనవాళ్ళు ఈ తేడా కనిపెట్టి, "ఓరి మీ కంగారు కాలా! మీకు వచ్చిన భయం లేదర్రా. ఇది 'జీలకర్ర శృంగనాదమే గాని పిండారీల శృంగనాదంకాదు", అంటూ భయపడి పారిపోయే అమాయకులను మందలించి ధైర్యం చెప్పేవాళ్ళు. 'ఓహో! ఇది జీలకర్ర శృంగనాదమేనా? ఐతే ఫరవా లేదు,' అనుకొని వాళ్ళుకూడా వెనక్కు మళ్ళి కుదటపడేవాళ్ళు.

శృంగనాదం వినపడేసరికే గజ గజ వణికి పోవలసిన ఆ రోజుల్లో జీలకర్ర వర్తకుల శృంగనాదానికి భయపడవలసిన అవసరం లేకపోవటంవల్ల, ఏదైనా ఒక మనిషిని గురించిగాని, ఒక పనిని గురించి గాని నిర్లక్ష్యభావాన్ని తెలపటానికి గాను "ఆం—పోదూ జీలకర్ర, శింగినాద మున్ను," అనే స్వరూపంలో ఈ సామెత వాడుకలోకి వచ్చింది.

"ఇది 'జీలకర్ర శృంగనాదమే' కదా ఐతే ఫరవాలేదు" అని ప్రజలు అనే మాటలు క్రమేపీ అటునుంచి ఇటు తిరగ బడి, 'శింగినాదం—జీలకర్ర' గా మారి పోయి, అమల్లోకి వచ్చినై.






[రాజుగారి తోటలో ఆ ముగ్గురుపిల్లలూ స్పృహతప్పి పడిపోవటం, ఆ సంగతి దాదివల్ల తెలుసుకున్న రాజూ రాణీ హడలిపోతూ అక్కడికి పరుగెత్తటం, ఈలోగా ఆస్థానవైద్యుడికి కబురు వెళ్ళటం వరకూ క్రిందటిసారి చదివారు కదూ? ఆ తర్వాత ఏమి జరిగిందనుకొన్నారు?]

రాజూ, రాణీ తోటకి చేరుకునేసరికి ముగ్గురు పిల్లలూ కళా కాంతి లేకుండా పడివున్నారు. చూడగా ఒళ్లు చల్లబడింది, శ్వాస సరిగా ఆడటంలేదు. ఇదిచూచి కంగారుపడి, 'ఇదేమిట్రా భగవంతుడా!' అని చెప్పి అమిత విచారంతో రాజూ రాణీ కొయ్యబారిపోయారు. మరి కొద్దిసేపటికి ఆస్థానవైద్యుడు వచ్చి రాజు భుజం తట్టే వరకూ వారు ఈ ప్రపంచంలోనే లేరు.

అప్పుడు ఆస్థానవైద్యుడు ఆ చుట్టుప్రక్కల పరీకించాడు. పిల్లలు పడివున్న చోటికి కొంచెం దూరంలో ఒక పండు కనిపించింది. పండుపైన అక్కడక్కడ పన్ను దిగబడ్డిన గాట్లు కనిపించినై. ఆస్థాన వైద్యుడు ఆ పండును తీసుకొని వాసన చూచి, "ఓహో, ఇదా సంగతి! ఇది విషపు పండు. దీనిని కొరకటంవల్లనే పిల్లలు యిలా పడిపోయారు" అని వెంటనే ఏదోమందు పిల్లలకి వాసన చూపించాడు. అలా చూపటంవల్ల ఆకస్మికప్రమాదం ఏమీ కలగకుండా, ఆ పిల్లలు అదేస్థితిలో నిలిచివున్నారు. తర్వాత ఆపండును దాదికి చూపుతూ—"ఈ పండు ఎక్కడిదో నీకు తెలుసా?" అని అడిగాడు.

అందుకు బదులుగా దాది యిలా చెప్పసాగింది — 'మామూలు ప్రకారం




అమ్మాయిలను షికారుకని వెంటబెట్టుకు వచ్చానండి. కొంతసేపు అలా అలా తిప్పి చివరకి ఈ చెట్టుకిందికి వచ్చి కూర్చున్నామండి. ఇంతలోనే అమ్మాయిలు 'దాహంగా వుంది నీళ్లు తెమ్మ'ని అడిగారండి. నేను నీళ్ళు తీసుకుని తిరిగివచ్చేటంతలో పెద్దమ్మాయి, చిన్నమ్మాయి అప్పటికే స్పృహతప్పి పడిపోయి వున్నారండి. నేను సరిగ్గా వాళ్ళదగ్గిరికి వచ్చేవేళకి బుల్లిఅమ్మాయిగారు ఈ పండు కొరుకుతున్నారండి. ఏమిటా ఈపండు అని నేను చూచేటంతలో బుల్లిఅమ్మాయిగారుకూడా స్పృహతప్పి పడిపోయారండి. ఇంతకు మించి నాకు మరేమీ తెలియదండి" అని చెప్పి ఆగింది.

ఆస్థానవైద్యుడు తల ఎత్తి ఒక్కసారి చెట్టుపైకి చూచేసరికి దానిపైన ఒకగద్ద కనిపించింది. "అదుగో ఆ పాపిష్ఠి పక్షే ఈ పండు పడేసి వుంటుంది. ఇంకా చూస్తారేం, చంపండి దాన్ని" అని అరిచాడు. అక్కడ చేరినవాళ్లలో ఒకడు తన బాణంతో ఆ గద్దని కొట్టబోయేసరికి అది రివ్వున ఎగిరి, మరి కనపడకుండా పోయింది.

ఈలోగా ఆస్థానవైద్యు డిచ్చిన ఔషధం పనిచేసి, పిల్లలు ముగ్గురూ కదలసాగారు. అప్పటికిగాని అక్కడ చేరినవా రెవరికీ ప్రాణాలు కుదటబడలేదు. తర్వాత ముగ్గురు పిల్లల్నీ తీసుకుని, ఆస్థానవైద్యునితో సహా రాజూ రాణీ తమ మేడ చేరుకున్నారు. తిరిగి ఆస్థానవైద్యుడు మరో ఔషధం యిచ్చాడు. మరి కొంతసేపటి కల్లా పిల్లలు ముగ్గురూ లేచి కూచున్నారు. ఇంత జరిగినా ఆ పిల్లలు కొంచెంకూడా అలిసినట్లు కనిపించలేదు. యథాప్రకారం కలకల్లాడుతోనే వున్నారు. పిల్లలు కలకల్లాడుతూ వుండటం చూచి, రాజూ,



రాణీ, అస్థానవైద్యుడూకూడా ఎంతగానో సంతోషించారు.

ఈ ప్రమాదం జరిగిననాటికి పిల్లలు నాలుగేళ్ళవాళ్ళు. జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారం యింకా మూడేళ్లవరకూ వాళ్లకి దినదినగండమే అని రాజు నిశ్చయించుకునే ఉన్నాడు. ఈ మూడేళ్ళు వాళ్లకి ఏ అపదా రాకుండా కాపాడటం ఎలాగా అని ఇప్పుడు తీవ్రంగా ఆలోచించసాగాడు.

ఒకనాడు రాజు ఒంటరిగా తోటలో షికారుచేస్తూవుండగా ఒకచోట ఒక బండ జాయి కనిపించింది. ఆ బండపైన "భూగృహం" అని వ్రాసివుండటం కనిపించే సరికి రాజు ఆ బండని తొలిగించి చూచాడు. మెట్లు కనిపించినై.

రాజు ఒక్కొక్క మెట్టే దిగి పోయిపోయి ఒక పెద్ద మహలు చేరుకున్నాడు, ఆ మహలు ఎవరు ఎప్పుడు ఎందుకు కట్టించారో రాజుకి తెలియదు. దాని గోడలన్నీ పాలరాతితో చెక్కబడి ఉన్నై. నేల అంతా పచ్చలతో తాపటం చేసివున్నది. అనేక రకాల వింతలతో, విలువైన వస్తువులతో ఆ మహలు ఎవరో గొప్ప ప్రభువు కట్టించినట్టుగా వున్నది.

రాజు ఆ మహలు అంతటా వింతగా చూచి, తిరిగి వచ్చినదారినే పైన తోటలోకి చేరుకున్నాడు. బండని మళ్లీ యథా ప్రకారంగా వుంచి అక్కడ ఆ బండ వున్నట్లు తనకుతప్ప మరెవరికీ తెలియకుండా వుండేటందుకుగాను అక్షరాలు వ్రాసివున్నవైపు లోపలికి మూసి అప్పటికీ మనసుకి తృప్తి కలగక ఆ చుట్టుప్రక్కల వున్న ఆకూ అలమూ తెచ్చి కంటికి కనిపించకుండా బండ కప్పివేశాడు.

తరువాత రాజు మేడకి తిరిగివచ్చాడు. కాని తాను తోటలో చూచిన 'భూగృహం' గురించి రాణికికూడా చెప్పలేదు. ఎందు

వల్లనంటే భూగృహ రహస్యం తనకితప్ప మరో పురుగుకికూడా తెలియకూడదని రాజుకి ఆరాటం పట్టుకొన్నది. ఇప్పుడు ఇటువంటి రహస్య గృహం తలవని తలంపుగా కంటబడింది గనుక ఇక తన కుమార్తెలకి అపదలు రాకుండా చూడటానికి చేయవలసిన ఏర్పాట్లుగురించే తన దృష్టి అంతా కేంద్రీకరించాడు.

మొట్టమొదట రాజు ఒక వందమందికి మూడేళ్ళపాటు సరిపడేటంత ఆహార సామగ్రి అవీ, నమ్మకమైన సేవకుల సహాయంతో భూగృహంలోకి చేర్పించాడు. ఆ సేవకులని తిరిగి బయటికి రానివ్వకుండా అందులోనే బంధించి తాను మాత్రం తిరిగి మేడకు రోజూలాగానే చేరుకున్నాడు. తర్వాత ముగ్గురు దాసీలతో సహా తన ముగ్గురు కుమార్తెలను వెంటబెట్టుకొని తోటలోకి వెళ్లాడు. రాజు షికారుకు తీసుకు వెళుతున్నాడు అనుకున్నది రాణి. తోట చేరుకోగానే రాజు సరాసరి భూగృహ ద్వారంవద్దకు వెళ్ళి అక్కడ ఆకూ, అలమూ అవతలికి విసిరివేసి, దానికింద ఉండే బండను తొలగించాడు. దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యపోయి



రాజు ఇంకా ఏమిచేస్తాడో అని ఆత్రంతో చూస్తున్నారు. రాజు ముందు దాసీలని పిల్లలతోసహా మెట్లుదిగి లోపల ప్రవేశించమని వాళ్ళ వెనకనే తనూ లోపలికి వెళ్లి వెంటనే ఎవళ్ళకూ తెలియకుండా బండతో తిరిగి ద్వారం మూసివేశాడు.

ఒక్కొక్క మెట్టు దిగుతున్నకొద్దీ దాసీలకు భయం జాస్తి కాసాగింది. రాజు తమనీ, తన పిల్లల్ని యిలా ఎక్కడికి ఎందుకు తీసుకుపోతున్నాడో వాళ్ళకి అర్థంకాలేదు. పోనీ అడిగి తెలుసుకుందామంటే రాజుని ప్రశ్నించేందుకు వాళ్ళకి ధైర్యం చాలలేదు. అందుచేత ప్రాణాలు అరచేతుల్లో పట్టుకొని అలా దిగుతూపోయి చివరకు మహలు చేరుకున్నారు. అంతకుముందే రాజు అక్కడ బంధించి వుంచిన సేవకులని చూచేసరికి దాసీలకి కొంత ధైర్యం కలిగింది. ఇదంతా రాజు ఏదో ముందు ఆలోచనతోనే ఏర్పాటు చేశాడని అప్పటికి తెలిసింది వాళ్లకు.

ఆ తర్వాత రాజు అక్కడవున్న వందమంది నౌకర్లకూ, ఆ ముగ్గురు దాసీలకూ తన ముగ్గురు పిల్లల్ని వప్పగిస్తూ యిలా చెప్పాడు—



"ఈ నా చిట్టితల్లులు ముగ్గురూ నాకు లేకలేక కలిగిన సంతానం అని మీ అందరికీ తెలుసుకదా? వాళ్ళకి యిప్పుడు నాలుగోఏడు. ఈ నాలుగేళ్ళలోనూ వాళ్లు ఎన్నో గండాలు గడిచి ఎలాగో బ్రతికి బైట పడిన సంగతికూడా మీకు తెలిసేవున్నది. జాతకరీత్యా వాళ్లకి మరో మూడు సంవత్సరాలవరకూ దినదిన గండమేననీ, ఈ మూడేళ్ళూ గడిచిపోతే ఆతర్వాత వాళ్ళకి ఎటువంటి భయమూ వుండదనీ తేలింది. ఈ మూడేళ్ళపాటూ వీళ్ళను ఈ భూగృహంలో దాచి మీకు వప్పగిస్తున్నాను. ఇందులోకి మరోపురుగు రావటానికి అవ




కాశంలేదు. నా పిల్లల్ని మీరు యిక్కడ కాపాడుతున్నట్టు మీకూ నాకూ తప్ప మరెవ్వరికీ తెలియదు. రాణికయినా తెలియదు, పుట్టినప్పటినుంచీ ఈ నా పిల్లల్ని ఏదో దుష్టగ్రహం వెంటాడుతూవున్నదని నా నమ్మకం. వాళ్ళు ఈ భూగృహంలో వున్నట్లు ఆ గ్రహానికి ఏమాత్రం తెలిసినా ఎలాగో వీళ్లని తన పొట్ట బెట్టుకుంటుంది. కనుక ఈ విషయం బైటకి పొక్కకుండా చాల జాగ్రత్తగా వుండటం మీ అందరి విధి. వీళ్లు యిక్కడ వుంటున్నట్టు పిట్టకయినా తెలిసిందీ అంటే అది నావల్లనన్నా కావాలి, లేదా మీవల్లనన్నా కావాలి. నేను మాత్రం ఈ మూడు సంవత్సరాలూ ఈ విషయం ఎత్తనే ఎత్తను. అలాగే మీరూ జాగ్రత్తతో వుండి నాకు సాయపడాలి. ఇందుకు భిన్నంగా జరిగిందీ అంటేజాగర్త. అలా కాక నమ్మకంగా నా తల్లుల్ని కాపాడారంటే గడవు తీరినతర్వాత మీరు కని విని యెరుగని గొప్ప బహుమతులు యిస్తాను. మీకు ఈ మూడేళ్లపాటూ కావలసిన ఆహారపదార్థాలూ అవీ అన్నీ యిక్కడే వున్నై. కనుక యింతకుముందు నా మేడలోవుండగా నా తల్లులు ఎలా సుఖంగా ఉండేవారో యిప్పుడూ అలాగే ఏ కొరత లేకుండా ఉండవచ్చు. నా చిట్టితల్లులకి మరేదైనా అవసరమని మిమ్మల్ని అడిగితే నాతో చెప్పండి, వెంటనే సమకూరుస్తాను. ఎప్పటికప్పుడు వచ్చి మీ అందరి క్షేమం కనుక్కుంటూనే వుంటాను. మరి ఇక నే వెళుదునా?" అని అడిగాడు రాజు.

ఇది వింటున్న ఆ వందమంది సేవకులూ, ముగ్గురు దాసీలూ మొట్టమొదట భయంతో తెల్లబోయి చూచినా, రాజు తీరా ఈ సందర్భంలో చెప్పదలచిన సంగతులన్నీ చెప్పి ముగించేసరికి వారందరూ ఎంతో సంతోషంగా కనిపించారు.



"మొదట మొదట మమ్మల్ని ఈ భూగృహంలోకి ఎందుకు తెచ్చారో అర్థం కాక మేము ఎంతో భయపడ్డాము. కాని యిప్పుడు నిజం తెలుసుకున్నాం. కనుక మాకు ఏవిధమైన చింతాలేదు. అమ్మాయిలను కంటికి రెప్పలా కాపాడవలెననే విషయం మీరు ప్రత్యేకించి ఇంతదూరం మాకు చెప్పాలెనా? అది మా విధి. మా ధర్మం మేము తప్పక నెరవేర్చుకుంటాము. మీరు నిశ్చింతగా వుండండి. కాని మా సందేహమల్లా ఒక్కటే—అమ్మాయిలనుయిక్కడ దాచినట్టు రాణీవారికికూడా తెలియదంటిరే? మరి యిప్పుడు మీరు ఒంటరిగా మేడకుపోతే రాణిగారు అమ్మాయిలు ఏమైనారని అడగరా?" అన్నారు.

"అదంతా నేను చూచుకుంటాను. మీరు వీళ్ళవిషయమై జాగ్రత్తపడండి" అనిచెప్పి రాజు తిరిగి తన మేడకి బయలుదేరాడు.

ఇక అక్కడ రాణీ సంగతి ఎలా వుందో చూడండి. పిల్లల్ని షికారుకని తీసుకువెళ్ళిన రాజు అప్పటికి ఎంతో సేపు అయినాకూడా తిరిగి రాకపోయేసరికి మళ్లీ ఏం ప్రమాదం వచ్చిపడిందో అని ఖంగారుపడుతూ, ఎప్పుడెప్పుడు వస్తారా అని రాణీ ఎదురుచూస్తున్నది.

ఇంతలో రాజు పెద్ద పెట్టున ఏడుస్తూ అక్కడికి చేరుకున్నాడు. షికారుకని పిల్లల్ని వెంటబెట్టుకువెళ్ళిన రాజు, వాళ్ళు లేకుండా ఒక్కడే తిరిగి రావటం, పైగా ఏడుస్తూ రావటం చూడగానే మనస్థైర్యం తప్పి, రాణీ మొదలునరికిన చెట్టులాగా కూలిపోయింది.

---

[ముగ్గురు పిల్లల్ని సురక్షితంగా భూగృహంలో ఒప్పగించి సంతోషంగా యింటిముఖం పట్టిన రాజు యిలా గుండెలు బాదుకుంటూ మేడ చేరుకోవటానికి గల అంతర్యం ఏమిటి? ఈ సమస్య వచ్చేనెల చదువుదురుగాని]






అనగనగా ఓఊరు. ఆఊళ్ళో ఓమేక. ఆ మేకకి ఆరు పిల్లలు.

ఆ అరుపిల్లలూకూడా చాలా అందమైనవి. నిగనిగలాడుతో, చెంగు చెంగున గంతులేస్తూ, చూడ ముచ్చటగా ఉండేవి ఆ పిల్లల్ని తల్లిమేక ఎంతో గారాబంగా చూసుకునేది. రోజూ ఆవూరిపక్క అడవికి వెళ్లి మేతతెచ్చి పిల్లలకి పెడుతూవుండేది.

ఒకనాడామేకకి అడవిలో ఒక తోడేలు కనపడింది. ఆ తోడేలు మేక వెనకాలే వచ్చి, మేక ఇల్లెక్కడుందో కనిపెట్టి వెళ్ళిపోయింది. తానింట్లో లేకుండాచూసి ఆ తోడేలువచ్చి తన పిల్లల్ని ఎక్కడ మింగేస్తుందో అని ఆ మేకకు భయంవేసింది. రోజూకిమల్లేనే అడవిలోకి వెడుతో మేక తన ఆరు పిల్లల్నీ పిలిచి, "నేను వచ్చేదాకా మీరు అవతలా ఇవతలా తిరక్కండి. తలుపు వేసుకుని లోపలే కూచోండి. తోడేలువచ్చి తలుపు తియ్యమని ఎంత అడిగినా తియ్యకండి" అంది. ఆపిల్లల్లో కల్లా చిన్నదానికి ఓ అనుమానం వచ్చింది. "తోడేలేవచ్చి పిలుస్తోందో, నువ్వేవచ్చి పిలుస్తున్నావో ఎలా తెలుస్తుందే మాకు?" అని అపిల్ల తల్లినడిగింది. "ఔను నిజమే నీమాట. చెపుతా విను. తోడేలు గొంతుక నా గొంతుకమల్లే కాకుండా బొంగురుగా ఉంటుంది. పైగా నా కాళ్ళు తెల్లగా ఉన్నై. తోడేలికాళ్లు నల్లగా మసిబొగ్గులా ఉంటాయి" అని ఆనవాలుచెప్పి, తల్లిమేక ఆడవికి వెళ్ళిపోయింది.

మేకపిల్లలు తలుపులు బిడాయించుకుని లోపల కూచున్నాయి. మరి కాస్సేపటికల్లా తోడేలువచ్చి, తలుపులు మూసి ఉండడం చూసి,

"పిల్లల్లారా తాయిల్లం
తెచ్చా తలుపూ తీయండి!"



అని పాట పాడుతూ పిలిచింది. ఆ పిలుపు విని, 'అమ్మవచ్చింద'ని పెద్ద మేకపిల్లలు ఐదూ గబగబా తలుపు తియ్యడానికి వెడుతూంటే చిన్నపిల్ల "అమ్మ కాదర్రా! గొంతుక బొంగురుగా ఉంది. ఇది తోడేలు," అంది. 'నిజమే' నంటూ ఆ పిల్లలు,

"పోవే, పోవే, తోడేలా!
బొంగురు గొంతుక తోడేలా!"

అనేసరికి పిల్లలికి తనగొంతుక తెలిసిపోయిందనేసి, గబగబా కోమటి కొట్టుమీదికెళ్లి ఇన్ని మిరియాలూ; పాలవాడిదగ్గరకెళ్ళి ఇన్నిపాలూ తెచ్చుకుని, పాలల్లో మిరియపుగుండ కలిపి తాగేసి, గొంతుక బొంగురు సవరించుకుంది. అప్పుడది మళ్లీ మేకయింటికి వెళ్ళి,

"తీయ తీయని తాయిల్లం
తెచ్చా, తలుపూ తీయండి!"

అంటూ పాడింది.

"ఈమాటు పిలుస్తున్నది అమ్మేనం"టూ పెద్ద మేకపిల్లలైదూ తలుపు తియ్యడానికి పరుగెత్తుతూంటే, చిన్నమేకపిల్ల 'ఉండండర్రా ఉండండి. దీని కాళ్ళు నలుపో తెలుపో చూద్దాము" అంది. పెద్దదాని నడుంమీద రెండోది, రెండోదాని నడుంమీద మూడోదీ, ఇలా వరసగా నిలబడ్డాక ఆఖరిపిల్ల ఐదోదాని నడుంమీద నిలబడి ఎత్తు కిటికీలోంచి అవతలకు తొంగి చూసింది. "కాళ్లు నల్లగా మసిబొగ్గుల్లాగున్నాయర్రా. అమ్మకాదు. తోడేలే!" అంది, అప్పుడాపిల్లలు మళ్లీ దాన్ని పోపొమ్మని గట్టిగా కసిరికొట్టినై.

తన కాళ్ల రంగు సంగతికూడా వాట్లకి తెలిసిపోయిందని, తోడేలు గబగబా ఊళ్ళోకి పరుగెత్తుకెళ్లి ఓ ముసిలవ్వ అట్లు వేసుకుందామని పిండి రుబ్బిపెట్టుకుంటే ఆపిండిలో తన నాలుక్కాళ్లూ ముంచి, తెలుపు చేసుకువచ్చింది. "ఇంక మేక

పిల్లలు నన్ను కనిపెట్టలే"వంటూ, మూడో మాటు మేకయింటికి వెళ్లి పిల్లల్ని పిలిచింది. ఆదివరకు మల్లెనే చిన్నమేకపిల్ల కిటికీలోంచి తొంగిచూచి, "కాళ్లు తెల్లగా ఉన్నాయ్. నిజంగా అమ్మేనర్రా" అంది.

అప్పుడా పిల్లలు అమ్మతెచ్చిన తాయిలం తిందామనుకుంటూ గబగబా వెళ్లి తలుపు తీశాయి. తీస్తే ఏముంది? తోడేలు! ఆపిల్లలన్నీ హడిలి పరుగెత్తుకుపోయి, తలొకమూలా దాక్కున్నాయి. కాని తోడేలు ఒక్కొక్కదాన్నే వెతికి పట్టుకుని మింగేసింది, పరుపు అడుగున దాగివున్న చిన్న మేకపిల్లమాత్రం తోడేలుకు కనపడలేదు. తోడేలు పొట్ట యీడ్చుకుంటూ వెళ్లి అయాసంచేత అట్టేదూరం పోలేక ఓ యేటి ఒడ్డున పడుక్కుంది.

తల్లిమేక యింటికివచ్చి పిల్లల్ని పేరు పేరునా పిలిచింది. తనపేరు వినపడి చిన్న మేకపిల్ల పరుపు అడుగునుంచి బయటికొచ్చి, జరిగిన సంగతంతా తల్లితో చెప్పింది. తల్లీ పిల్లా తోడేలు పోయిన దారినే వెళ్ళేటప్పటికి ఏటిఒడ్డున తోడేలు గుఱ్ఱుపెడుతో నిద్రపోతోంది. తల్లిమేక గబగబా వెళ్లి దర్జీవాణ్ణి తీసుకొచ్చింది. దర్జీ



వాడు తన పెద్దకత్తెరతో తోడేలు పొట్టను కత్తిరించేటప్పటికి, అందులోంచి ఒకదాని వెనక ఒకటి ఐదు మేకపిల్లలు గంతులేసుకుంటూ బయటకొచ్చేశాయి.

అప్పుడు ఆ మేకపిల్లలు కోపంకొద్దీ పెద్ద రాళ్లుతెచ్చి, తోడేలు పొట్టలో కుక్కేశాయి. దర్జీవాడు తన సూదితీసి, తోడేలు పొట్ట మామూలుగా కుట్టేసి వెళ్ళిపోయాడు.

అప్పుడు తోడేలుకు మెలుకువవచ్చి, ఏటిలో మంచి నీళ్లు తాగుదామని లేచింది. కాని, కడుపులో రాళ్లుండడంచేత, ముందు బరువెక్కువై, అది తలకిందుగా ఏట్లో పడి బుడుంగుమని మునిగిపోయింది.



# వింత కోరిక

ఒకానొకప్పుడు విదర్భదేశాన్ని పరాక్రముడనే రాజు పాలించేవాడు. ఆయనకు కనకప్రభ అని ఒక్కర్తే కూతురు. యుక్త వయస్సు రాగానే ఆమెకు పెళ్లి చేయాలనుకొన్నారు తలిదండ్రులు. కాని, ఆమె "హేమద్వీపం పోయివచ్చి, అక్కడి వింతలు చెప్పగలవాడెవడో, అటువంటివానినే పెళ్ళాడుతా' నని పట్టుపట్టింది.

ఈ వింతకోరికకు తలిదండ్రులు ఆశ్చర్యపోయారు. వాడవాడలా చాటింపు వేయించాడు రాజు. కాని 'నాకు తెలుసును' అని ఒకళ్లూ ముందుకు రాలేదు.

ఈ చాటింపు విన్న విష్ణుశర్మమాత్రం రాజువద్దకుపోయి, నేను ఎన్నెన్నో దేశాలు తిరిగి వచ్చాను. హేమద్వీపంకూడా చూచి వచ్చాను' అనేసరికి, కనకప్రభ కొన్ని కుశలప్రశ్నలు వేసింది. ఆమెవేసిన ప్రశ్నలలో ఒక్కదానికి జవాబుచెప్పలేక, తెల్లముఖంవేయగా, 'వీడు కల్లబొల్లి మాటలు చెప్పి మోసగించాలని చూస్తున్నాడు. కనుక వెంటనే మనరాజ్యంనుంచి తరిమివేయండి' అన్నాడు రాజు.

ఇలా పరాభవంచెంది వెళ్ళగొట్టబడిన విష్ణుశర్మ ఏమైనా సరే, నిజంగానే హేమద్వీపం పోయిరావలెననే దీక్షతో ప్రాణానికి తెగించి, భయంకరమైన కీకారణ్యాలు దాటుకుని, చివరకు సముద్రతీరం సమీపించి అక్కడ సిద్ధంగా వున్న ఓడలో ఎక్కేశాడు.

బయల్దేరిన వేళావిశేష మేమిటోగాని, విష్ణుశర్మ ఎక్కిన ఓడ ఇంచుమించు సగందారిలో ఉండగా పెనుగాలి వీచి, గొప్ప వర్షం కురిసి, ఆ ఓడ గంగార్పణమై జనమంతా మునిగిపోయారు. అందరితో పాటు విష్ణుశర్మకూడా మునిగిపోయాడు. కాని అతన్ని ఒక పెద్దచేప మింగివేసింది.

ముద్దా సోమప్రశాస్త్రి, పరశువాకం



ఆ చేప పోతూపోతూ రత్నద్వీపం సమీపించి, అక్కడ జాలరులు పన్నివుంచిన వలలో చిక్కుకోగా, వాళ్లు దానిని తమ రాజు ఐన సత్యవ్రతునివద్దకు తీసుకపోయారు. రాజు దాన్ని చూచి, "ఇందులో ఏదో విచిత్రం ఉండిఉండాలి. కనుక, జాగ్రత్తగా చీల్చ"మన్నాడు.

అలా చీల్చగానే, జీవాలతో వున్న విష్ణుశర్మ బయటకు వచ్చాడు. అతన్ని చూచి రాజు అత్యాశ్చర్యంతో 'నీవెవడవు? ఎక్కడినించి వచ్చావు?' అంటూ ప్రశ్నలు కురిపించేసరికి, విష్ణుశర్మ తన చరిత్రంతా పూసగుచ్చినట్టు వెల్లడించి, హేమద్వీపానికి దారి చెప్పమని కోరాడు.

అందుకు సత్యవ్రతుడు సంతోషించి "ఆ ద్వీపం పేరు విన్నానేగాని, దారి నాకూ తెలియదు. రేపులేదు ఎల్లుండి రాహుల ద్వీపంలో గొప్ప విందు జరగబోతున్నది. అక్కడికి ముల్లోకాలూ సంచారంచేసే మహామహులెంతోమంది వస్తారు. వాళ్లను అడిగితే హేమద్వీపానికి దారి ఇట్టే తెలుస్తుంది. అంతవరకు ఇక్కడనే ఉండవలసింది. ఎల్లుండి నాతోపాటు రాహుల ద్వీపం వద్దువుగాని" అంటూ చెప్పాడు.



మూడవరోజున విష్ణుశర్మను వెంటబెట్టుకుని రాజు రాహుల ద్వీపానికి బయల్దేరాడు. సముద్రంమీద ఓడలో ప్రయాణిస్తూవుండగా పెద్దగాలి వీచి, ఓడ ఒక సుడిగుండంలోపడి, ముక్కముక్కలైంది. విష్ణుశర్మకు ఒక కొయ్యముక్క దొరికింది. అది పట్టుకుని ఎలాగో బ్రతికి బయటపడి, ఒక గట్టు చేరుకుని, ఆ గట్టుపైన ఉండే చెట్టు ఎక్కాడు. సత్యవ్రతుడు మాత్రం తప్పించుకోలేక సుడిగుండంలో మాయమయ్యాడు.

విష్ణుశర్మ నిరాశతో క్రుంగిపోయి ఏమీ తోచక అలానే కూర్చున్నంతలో ఒక పెద్ద





గండభేరుండ పక్షుల గుంపు వచ్చి మర్రి చెట్టుమీద వాలింది. పక్షిభాష తెలిసిన విష్ణుశర్మ, అవి "హేమద్వీపం" పోతో తున్నవని వాటి మాటలవల్ల గ్రహించి తననుకూడా ఆ ద్వీపానికి తీసుకపొమ్మని బలిష్ఠమైన ఒక పక్షిని కోరాడు. పక్షిభాష మాటాడగల శర్మను చూచి అది సంతో షించి, అతనిని తన వీపుమీద ఎక్కించుకొనిపోయి, హేమద్వీపంలోని ఒక ఉద్యాన వనంలో దింపివేసింది.

ఉద్యానవనంలోని చెలికత్తెలు విష్ణు శర్మను సరాసరి హేమద్వీపానికి తీసుక పోయి, తమ రాణిఐన కనకరేఖ ఎదుట పెట్టారు. కనకరేఖవల్ల అతను స్వాగతోప చారాలు పొంది, స్తిమితపడిన తరువాత, తను వచ్చిన పని వివరంగా చెప్పాడు.

అతను చెప్పినదంతా శ్రద్ధగా విని, కనకరేఖ తన చరిత్ర విష్ణుశర్మకు విని పించ నారంభించింది: "మే ము ముగ్గురం అక్కాచెల్లెళ్ళం. ఒకరోజున నా చెల్లెళ్లు ఇద్దరూ సరస్సులో ఉత్సాహంతో జలకాలాడుతూవుండగా, వాళ్ళు చిందించిన నీటి తుంపరలు అక్కడనే తపస్సు చేసుకొంటూవున్న ఒక మునీశ్వరునిపైన పడినై. వెంటనే ఆయన 'మీరు భూలో కంలో మానవులుగా పుట్టండి' అని శపించాడు. ఆ శాపవశాన వాళ్ళిద్దరూ ఇప్పుడు మర్త్యలోకంలో ఉన్నారు. నేనొక్కర్తినే ఈ హేమద్వీపంలో ఉంటున్నాను" అని చెప్పింది.

ఇలా వారివారి చరిత్రలు ఒకరికొకరు చెప్పుకొన్నప్పటినించీ వారి స్నేహం అభి వృద్ధిఅయి, చివరకు వారు పెళ్ళాడుదా మ్మనుకొన్నంతవరకు వచ్చింది. "ఐతే, నా తండ్రి అనుజ్ఞపొంది మూడు రోజుల కల్లా తిరిగివస్తాను. ఈలోపల నీవు ఈ భవ నమంతటా యథేచ్ఛగా విహరించవచ్చు.

కాని, ఆ మధ్యగదివేపు మాత్రం పోబోకు" అని చెప్పి వెళ్ళింది ఆమె.

విష్ణుశర్మ రెండు రోజులపాటు అపురూపమైన ఆ భవనమంతా ఆనందంగా కలియ తిరిగాడు. కాని, ఇక ఉండబట్టలేక మూడవ రోజున కనకరేఖ వద్దని చెప్పిన మధ్యగదివద్దకు వెళ్ళాడు. ఆ గదికిగల రెండు తెరలను మెల్లగా ఒత్తిగించేసరికి, హంసతూలికాతల్పం మీద పవ్వళించివున్న ఒక సుందరి కనిపించింది. ఏసుందరికోసమైతే విష్ణుశర్మ ఈ కష్టాలన్నీ పడుతూవున్నాడో, ఆ కనకప్రభే ఈమె !!! అత్యాశ్చర్యంతో అతను మరి కొంచెం లోపలికి పోగా. సరిగా కనకప్రభ వంటి స్త్రీయే ఇంకొకామె మరి ఒక తూలికా తల్పంమీద శయనించివుంది.

మరింత ఆశ్చర్యంతో విష్ణుశర్మ ఇంకా లోపలకుపోయి, అక్కడి ఉద్యానవనంలో ప్రవేశించాడు.

ఆ ఉద్యానవనం మధ్య ఒక చక్కటి సరోవరమున్నది. సరస్సు గట్టుపైన బంగారు జీనుగల పంచకల్యాణిగుఱ్ఱం నిలబడివున్నది. విష్ణుశర్మ దానిని ఎక్కుదామని సిదపడేటంతలో అది ఫెడీమని



ఒక్క తన్ను తన్నింది. ఆ దెబ్బతో అతను ఆ సరస్సులో పడి మునిగిపోయాడు.

అడుగుకంటా ఒక్క బుడుకవేసి, మళ్ళీ పైకి తేలేటప్పటికి, విష్ణుశర్మ అటు యిటు పరికించి తాను యిప్పుడు సరిగా విదర్భ దేశంలోనే వున్నట్టు తెలుసుకొన్నాడు. ఇదంతా స్వప్న కథలాగా తోచింది. తీరా చూచుకొంటె, తను హేమద్వీపంలో ధరించిన విలువైన దుస్తులు, మణిహారాలు అవ్వీ స్పష్టంగా ఒంటిమీద కనపడుతున్నవాయె. మరి, అటువంటప్పుడు ఇదంతా కల అని ఎలా తోసిపుచ్చటం?

మరునాడు విష్ణుశర్మ పరాక్రమరాజు కోటకుపోయి, 'నేను హేమద్వీపానికి వెళ్లి వచ్చాను' అని చెప్పేసరికి 'అబ్బాయీ! ఈసారి అబద్ధం ఆడినట్టయితే తల కొట్టించి కోటగుమ్మానికి వేలాడగట్టిస్తాను సుమా!' అని హెచ్చరించాడు రాజు.

విష్ణుశర్మ నిర్భయంగా తను చూచి వచ్చిన వింతలన్నీ చెప్పి, తగిన తార్కాణాలు చూపించేసరికి, కనకప్రభ ఉత్సాహ భరితురాలై, "శర్మా! నీవు నాచరిత్ర నాకు జ్ఞాపకం చేయటంతోనే శాపవిముక్తి ఐపోయింది. నాకు ఎవరైతే శాపం విడగొడతారో వాళ్ళనే పెళ్ళాడాలని నిశ్చయించుకొన్నాను. కనుక నన్ను పెళ్ళి చేసుకోదలుచుకుంటే హేమద్వీపానికి వచ్చేసెయ్యి" అని చెప్పి తన మానవ శరీరం వదలి మాయమైపోయింది. కూతురు అదృశ్యమైనందుకు రాజూ రాణీ దుఃఖించారు.

తరువాత విష్ణుశర్మ సరిగా మునపటి దారినే బయల్దేరి, రత్నద్వీపం చేరుకొనేసరికి, సత్యవతుని కూతురు కనకావతి వచ్చి అతనితో "నన్ను నీకిచ్చి వివాహం చేయాలని మాతండ్రి అనుకొన్నాడు. కనుక, ఆయన సంకల్పం నెరవేర్చటం నావిధి' అన్నది.

విష్ణుశర్మ కనకావతిని వివాహం చేసుకొన్నాడు. అప్పుడు కనకావతి భర్తతో "ఇప్పటికి నాశాపంకూడా వదలిపోయింది. నేను హేమద్వీపంలోవుండే కనకరేఖకు రెండవ చెల్లెల్ని అంటూ తన చరిత్ర వెల్లడించింది.

ఒక పెద్ద మేఘంమీద వారు ప్రయాణించి హేమద్వీపం చేరుకొన్నారు. తరువాత విష్ణుశర్మ తనకోసం ఎదురు చూస్తూ వున్న కనకరేఖనూ కనకప్రభనూకూడా పెండ్లాడి, ముగ్గురు అక్కచెల్లెళ్లనూ రాణులుగా చేసికొని సుఖంగా వుంటున్నాడు.






పొడగట్లపల్లిలో పొట్టిపంతులనే ఒకాయన ఉండేవాడు. ఆయనభార్య చిట్టెమ్మ. గొప్ప పతివ్రత. చిట్టెమ్మ మామూలుగా అంద రమ్మలకు మల్లేనే ఉండవలసినంత ఎత్తూ ఉంది గాని పొట్టిపంతులు మాత్రం మరీ పొట్టివాడవటంచేత ఆవిడ ఎంత నడుం వంచుకు నిలబడినా బుజాల దగ్గరకే వచ్చేవాడు. పాపం చిట్టెమ్మకి తాను భర్త కన్నా పొడుగ్గా ఉండటం పతివ్రతా లక్షణం కాదనిపించింది.

"మీ ఆయన పొడుగ్గా ఉండకపోవటం ఆయన తప్పుగాని నీ తప్పుగాదు. ఆయన లోపానికి నువ్వేం చేస్తావ"ని పక్కింటి హరిదాసుగారి భార్య అహోబలమ్మగా రంటూ వుండేది. కాని చిట్టెమ్మకి మనస్సు సమాధానపడలేదు. "మీరే అలాగంటే ఎలాగ అహోబలమ్మగారూ? మొన్న రాత్రి మీవారే పతివ్రతల కథలు చెపుతూ ఏమన్నారో విన్నారుగా? భర్త ధృతరాష్ట్రుడికి కళ్ళులేనప్పుడు నాకుమాత్రం ఎందుకు కళ్ళుండాలని చెప్పేసి గాంధారి తన రెండు కళ్ళకూ గంతలు కట్టేసుకుందిటగా!" అంది చిట్టెమ్మ.

"గాంధారిలాంటి పతివ్రతలకే సాధ్యం కాని పని ఇది" అంది అహోబలమ్మ.

ఐనా చిట్టెమ్మకి తృప్తిగాలేదు. "పతివ్రతలకి అసాధ్యమేదీ లేదని మీవారే చెప్పేరు కదుటండీ నిన్నరాత్రి కథలో? చచ్చిపోయిన భర్తని సావిత్రి బ్రతికించుకుందిటగా?" అంది చిట్టెమ్మ. అందుకు అహోబలమ్మ, "ఆ మహా పతివ్రతలకి సాధ్యమైనట్లు మన కన్నీ సాధ్యం కావు చిట్టెమ్మా. ఐనా, ఒక సంగతి చెబుతాను, విను: ఆమధ్య మావాడు ఇనపరింగులు రెండుతెచ్చి దూలానికి అమరుస్తోంటే 'ఎందుకురా?' అని అడిగేను.

యస్. వి. చలపతి, కర్నూలు



'అవి పట్టుకొని నేల తగలకుండా వేళ్ళాడితే పొడుగవుతానన్నాడు."

ఈ మాటలు చెప్పి అహోబలమ్మ వెళ్ళిపోయింది. చిట్టెమ్మ తన భర్త పొడుగవటానికి ఇలాంటి ఏర్పాటేదో చేయాలని ఆలోచించింది. ఇల్లంతా వెతికిందిగాని ఎక్కడా రింగులు దొరకలేదు. రెండు చేంతాళ్లు కనపడినై. పడకగదిలో దూలానికి ఆ రెండు తాళ్ళూ కట్టింది. అవి పట్టుకుని వ్రేలాడడం అలవాటుచేసుకుంటే పొట్టిపంతులు పొడుగుకాకపోతాడా అని ఆమె ఆలోచన. ఎత్తుగా ఉన్న ఆ దూలం అందుకోటానికివీలుగా పెద్దకుర్చీపీట తెచ్చి దానిపైన చిన్న కుర్చీపీట నిలబెట్టింది. ఆ సాయంత్రం పొట్టిపంతులు ఇంటికొచ్చి, ఆ తాళ్లూ, క్రింద కుర్చీపీటలూ చూసి, 'ఎవణ్ణి ఉరితీద్దామనే ఈ ఏర్పాటంతా?' అన్నాడు కోపంగా.

కొందరి మనుష్యుల్ని ఉరితీస్తారనీ, ఉరితియ్యటంకోసం తాళ్లూ కుర్చీపీటలూ తెస్తారనీ ఆ పతివ్రతకి తెలియదు పాపం. 'ఇవన్నీ మీకోసమేనండీ' అంది అమాయకంగా. అతనికి ఒళ్లుమండి, 'ఏమిటి నన్ను ఉరితీస్తావా?' అంటూ చేతికర్రతో రెండు మోదులు మోదేడు. 'మీరు పొడుగెదుగుతారని ఇలా చేశానండీ' అని ఆమె తన మంచిఉద్దేశాన్ని చెప్పబోయింది గాని పొట్టిపంతులికి అర్థంకాక అడ్డమైన తిట్లూ తిట్టడం మొదలెట్టేడు. అతడలా ఎందుకు తిడుతున్నాడో చిట్టెమ్మకి తెలిసిందే కాదు. పంతులు మాటాడక పడుకున్నాడు.

చిట్టెమ్మకు ఏమీతోచక అహోబలమ్మగారింటికెళ్ళింది. దాసుగారూ భార్యా సావకాశంగా కబుర్లు చెప్పకొంటున్నారు.

'ఏమండీ, పూర్వానికి మల్లే ఇప్పుడు పతివ్రతలున్నారా?' అని దాసుగారిని భార్య ప్రశ్నించింది. "అబ్బే, ఏరీ? భర్త

నాలుగువీధులూ కాళ్ళరిగిపోయేట్టు తిరిగి తిరిగొచ్చి 'కాళ్లు లాగుతున్నాయి కొంచెం ఒత్తవే' అంటే, ఒత్తేపెళ్ళామే లేదు" అన్నాడాయన.

"అదేమిటండీ అలా అంటారు. పైవాళ్ళమాట నాకు తెలీదుగాని, నేను మటుక్కు ఎన్నడూ లోపంచేయలేదే" అంది అహోబలమ్మ. దాసుగారు అందుకొని, "అబ్బే నేను నీమాట చెప్పటంలేదు. నువ్వు మహా పతివ్రతవే. నీవలా నా పాదాలు ఒత్తుతూ పాతివ్రత్యం కనపర్చేవు కనకనే పొట్టివాణ్ణిలా ఇంత పొడగరినయాను" అన్నాడు. ఆమాటవిన్న చిట్టెమ్మ, "ఐతే దాసుగారూ, మీరు పెళ్లికాకపూర్వం పొట్టిగా ఉండేవారా?" అన్నది.

"ఔనమ్మా. మొదట్లో మీ ఆయనకన్నా పొట్టిగా ఉండేవాడిని! మా ఆవిడ పాతివ్రత్యంవల్లనే ఇప్పుడింత పొడుగయాను!" అన్నాడు దాసుగారు.

పాపం అమాయకురాలైన చిట్టెమ్మ నిజమేననుకుని ఇంటికివెళ్ళింది. మంచంమీద పొట్టిపంతులు గుఱ్ఱుపట్టి నిద్రపోతున్నాడు. తానుకూడా అతని కాళ్లను భక్తితో ఒత్తి, అతడు పొడుగయేటట్లు



చేసుకుందామనుకుని, మంచంమీద భర్త కాళ్ళదగ్గిర కూచుంది.

హరిదాసుగారూ అహోబలమ్మా కాస్సేపలాగే కబుర్లు చెప్పుకుని లోపలికి పోయి పడుకోబోయేసరికల్లా పొట్టిపంతులింట్లోంచి పెద్ద కేకలు వినపడ్డాయి. దాసుగారూ, భార్యా ఉలిక్కిపడి లేచి వీధులో కొచ్చారు. దాసుగారు చొరవచేసి 'ఏమిటయ్యా ఆడదానిమీద చెయి చేసుకుంటున్నావు?' అని గదమాయించేవరకు పొట్టిపంతులు తలుపు తీసుకొచ్చి, 'ఏమన్నారు? ఇది ఆడదా? నాపాలిటి బ్రహ్మరాకసి! నిద్రపోతూంటే పీక పిసికి చంపెయ్యా

బోయింది!' అన్నాడు. దాసుగారికంతా అయోమయంగా తోచి, 'ఏమిటమ్మా! ఈ గొడవ?' అన్నాడు. ఆవిడ ఏడుస్తో 'పతివ్రతను, భర్తని చంపుతానా, చెప్పండి? కంఠం ఒత్తుతూవుంటే ఇంత రభస చేశారు,' అంది.

"కంఠం ఒత్తడమేమిటి?" అన్నాడు దాసుగారు.

"అహెూబలమ్మగారు మీకు కాళ్ళు ఒత్తి తన పాతివ్రత్యంవల్ల మీరు పొడుగు అయేటట్లు చేశారుగా? నేను కూడా మా వారిని అలా చెయ్యాలని కాళ్లదగ్గర కూచున్నాను..." అంటుండగా దాసుగారు అడ్డుతగిలి, "కాళ్ళ దగ్గర కూచున్నదానివి కంఠం ఒత్తడమేమిటి?" అని అడిగాడు.

"కాళ్ళు ఒత్తుదామనే కూచున్నాను బాబూ. కాని అప్పుడు తులసిపేరుతో ఉన్న వారి కంఠం కనపడి నాకో ఆలోచన వచ్చింది. కాళ్ళు ఒత్తితేనే నేను పతివ్రతనైపోయి, వీరు పొడగరి ఔతారన్నప్పుడు, ఎప్పుడూ తులసిపూసల పేరుతో అలంకరింపబడి పవిత్రమై ఉండే ఆ కంఠం ఒత్తితే నా పాతివ్రత్య ప్రభావం క్షణాల మీద పనిచేసి మావారు నాకన్న పొడుగవుతారు కదా అనితోచి, కంఠాన్ని ఒత్తేను." అన్నది చిట్టెమ్మ అమాయికంగా.

తాను వేళాకోళానికన్న మాటలు నిజమని నమ్మి చిట్టెమ్మ అలా చేసిందని వెల్లడైంది దాసుకి. 'అయ్యో, ఎంత తెలివి తక్కువదానివమ్మా!' అని జాలిపడ్డాడు. పొట్టి పంతులు ఎగిరి గంతేసి, "ఏమిటి? ఇదా తెలివితక్కువది? సాయంకాలం నన్ను ఉరితీయటానికి సిద్ధమైంది!" అని తాళ్ళ సంగతీ, కుర్చీపీటల సంగతీ చెప్పేడు. అప్పుడు అహెూబలమ్మ నిజం తెలుసుకుని ఆపని తన సలహాపైన జరిగినందుకు విచారించింది. "పంతులూ, పాపం ఆవిడ మంచి ఉద్దేశంతోనే తలపెట్టింది ఈ పనులు. నీవు శాంతించు" అని నచ్చజెప్పేసరికి తాతలు దిగివచ్చారు.






# కలదాచిన కన్నప్ప

అనగనగా ఒక పేదవాడు. అతనికి ముగ్గురు కొడుకులు. అదేమి చిత్రమోకాని ఆ ముగ్గురు కొడుకులకూ ఒక్కనాటిరాత్రే విచిత్రమైన కలలు వచ్చినై. ఈసంగతి తెలిసి తండ్రి, "అబ్బాయిలూ!—మీకు వచ్చిన కలలు ఏమిటో చెప్పండి. అవి మంచివో చెడ్డవో కనుక్కొందాము" అనే సరికల్లా, పెద్దవాడూ రెండవవాడూ వెంటనే తమతమ కలలను విప్పి చెప్పేశారు. 'భేష్!—మీకు మంచికలలే వచ్చినై. శుభమే కలుగుతుంది' అని సంతృప్తిపడి, సంతోషాన్ని వెల్లడించాడు తండ్రి.

చివరకు, కడసారివాడైన కన్నప్పను పిలిచి అడిగేటప్పటికి 'నాకల నేనెవళ్ళకూ చెప్పను' అంటూ భీష్మించాడు. తండ్రి అన్నివిధాలా అడిగిచూచి, ఎంతకూ చెప్పక పోయేసరికి, ఒక చింతబరికె తీసుకొని కన్నప్పను చావగొట్ట నారంభించాడు. ఆ దెబ్బలకు తట్టుకోలేక కన్నప్ప గోలయెత్తి ఇంటి పెంకులు ఎగిరి పోయేటట్టుగా కేకలు పెట్టాడు.

అదేసమయాన ఆ దారిన పోతూవున్న పట్టపురాజు, కేకలువిని అక్కడికి వచ్చాడు. "ఇదేమిటయ్యా, ఎక్కడో పిచ్చివాడిలాగా ఉన్నావు. కుర్రవాణ్ణి ఉత్తపుణ్యానికి ఎందుకు బాదుకుంటావు. వాణ్ణి నాతో పంపించివెయ్యి. ఆ కల యేమిటో సంగతి ఏమిటో నేను మెల్లిగా బుజ్జగించి కనుక్కొంటాను" అని అంటూ, ఒక వరహాల సంచి పేదవాని చేతిలో పెట్టి కన్నప్పను గుఱ్ఱపు సారటుమీద ఎక్కించి తనవెంట తీసుకపోయాడు.

కోట చేరుకున్నతరువాత రాజు అనేక విధాల కన్నప్పను లాలించి అడిగాడు. ఐనా, కన్నప్ప తన కలను వెల్లడించలేదు. చివరకు రాజుకుకూడా విసుగెత్తింది.

పి. సుశీల, గుంటూరు



భటులతో "ఈమూర్ఖుడు రాజంటే ఏమిటో తెలుసుకో లేకున్నాడు. వీడికి నాశక్తి చూపించాలి. ఒక స్తంభం కట్టించి, దాని లోపల వీడిని జీవాలతో బంధించి వేయండి" అని కోపంగా ఆజ్ఞాపించాడు.

ఐతే—కన్నప్ప కోటకు వచ్చిన క్షణం నుంచీ, అతనిలో చాలా గొప్పలక్షణాలు ఉన్నవనీ, బ్రతికి బాగావుంటె ముందు ముందు ఒక మహాపురుషుడు కాగలడనీ, రాజకుమారి కనిపెట్టింది. తొందరపాటు వల్ల తనతండ్రి కన్నప్పను మూర్ఖునిగా తలిచాడేకాని, ఆతను నిజానికి మూర్ఖుడు కాడనీ, తనకు వచ్చిన కలను వెల్లడించకపోవటానికి బలమైన కారణం ఏదోవుండి తీరాలనీ ఆమె నిశ్చయించింది.

ఈ నిశ్చయంతో, కన్నప్పను ఏ ఉపాయంచేతనైనా బ్రతికించుకోవాలనుకున్నది. తక్షణమే స్తంభంకట్టే పనివాళ్లకు రహస్యంగా కబురుపంపి, ఆ కట్టబోయే స్తంభం గుల్లగా మనిషి ఉండేటందుకు వాసయోగ్యంగా చేయమనీ, రాకపోకలకు వీలుగా ఒక రహస్యద్వారం కూడా పెట్టుమనీ చెప్పింది.

ఆమె యిష్టానుసారంగానే పనివాళ్ళు స్తంభం కట్టారు. కన్నప్ప అందులో ప్రవేశించాడు. రాజకుమారి రోజూ అక్కడికి వస్తూ పోతూ, కన్నప్పకు ఎట్టి లోపమూ రాకుండా కావలసిన సదుపాయాలన్నీ సమకూరుస్తూ వుండేది.

ఇలా ఉండగా, ఒకనాడు హఠాత్తుగా బలవంతుడైన పొరుగురాజు పట్టపురాజుపైకి దండెత్తివచ్చి, 'నేను వేయబోయే ప్రశ్నలకు సమాధానం చెప్పినా సరే, ఓడిపోయానని ఒప్పుకున్నాసరే" అని సవాలు చేశాడు. అంతమాత్రాన, పౌరుషవంతుడైన పట్టపురాజు తల వంచేస్తాడా? 'ఏమిటి మీ మొదటి ప్రశ్న?' అని

కబురు పంపాడు. ఇందుకు బదులుగా పొరుగురాజు ఐదు గుర్రాలను పట్టపు రాజు రాజ్యంలోకి వదిలి, దేనికంటే ఏది వయస్సులో పెద్దదో చెప్పకోమన్నాడు.

ఈప్రశ్నకు సమాధానం ఏమీ తోచక పట్టపురాజు తలకట్టుకు పడుకొన్నాడు. రాజకుమారికి ఈ సంగతి తెలిసి ఆమె కూడా విచారించింది. ఆరోజున ఆమె కన్నప్పవద్దకు వెళ్ళగానే అతను 'విచారంగా కనపడుతున్నావే. కారణమేమిటి?' అని ఆమెను అడిగాడు.



జరిగిన సంగతి అంతా చెప్పింది రాజకుమారి. "ఓస్, ఈపాటిదానికే విచారమెందుకు? మీనాయన తలకట్టుకు పడుకోవటమెందుకు? దానికిది ఉపాయం..." అంటూ ఇలా చెప్పాడు, బుద్ధికుశలుడైన కన్నప్ప, "వరసగా, ఐదు సంవత్సరాలలో పండిన ఉలవలు తెప్పించి, ఉడకబెట్టి, ఐదు తొట్టెలలో పోయించాలి. ఏ ఉలవలు ఏ సంవత్సరంలో పండినవో ఆనవాలుంచుకోవాలి. మొదటి సంవత్సరంలో పండిన ఉలవల తొట్టెవద్దకు గుర్రాలలోకల్లా చిన్నది వస్తుంది. దానికంటె పెద్దగుర్రం రెండోయేడు పండిన ఉలవలు తినటానికి వస్తుంది. ఇలానే తక్కిన మూడు గుర్రాలున్నూ. అప్పుడు గుర్రాలను తొట్టెల వద్దకు వదిలితే ఏవయసుగుర్రం ఏతొట్టె వద్దకు వెళ్ళిందో గుర్తుపెట్టుకొని, వాటి వయస్సు సులువుగా తెలుసుకోవచ్చు."

రాజకుమారి ఈ ఉపాయం తండ్రికి చెప్పగా, రాజు ఆప్రకారమే చేసి, ఆ గుర్రాలలో దేనికంటె ఏది పెద్దదో సులువుగా కనిపెట్టి, పొరుగురాజుకు జవాబు చెప్పాడు. జవాబు సరియైనది కావటంచేత పొరుగురాజు ఏమనటానికీ వీలులేక పోయింది. కాని, ఎలాగైనా పట్టపురాజును చిత్తుచేయాలనే పట్టుదల ఎక్కువైంది.



తరువాత — పొరుగురాజు ఏక సమానంగా వుండే ఒకచిన్న మానుముక్క పంపించి, "దీనికి తుది ఏది, మొదలేది? చెప్పుకో"మన్నాడు. మళ్లీ ఏమీ పాలుపోక పట్టపురాజు తలకట్టుకు పడుకొన్నాడు. ఈ రోజుకూడా రాజకుమారి విచారపడింది. స్తంభంలో వుంటున్న కన్నప్ప మళ్ళీ ఆమెను కారణం అడిగాడు. ఆమె ఉన్నది ఉన్నట్టు సంగతి సందర్భాలు చెప్పింది. అప్పుడు కన్నప్ప, "ఓశ్ దీనికే ముంది? ఆ మానుముక్కకు మధ్యగా ఒక తాడు కట్టినట్టయితే, రెండువైపులా దూరం సమంగానే కనిపించినప్పటికీ, ఒక వేపు కొంచెంకిందికి మొగ్గుతుంది. కిందికి మొగ్గినవైపు మానుకి మొదలన్నమాట. రెండోవైపు మానుచివర అవుతుంది," అనే సరికల్లా బెంగతీరిన హృదయంతో రాజకుమారి వెంటనేపోయి తండ్రితో చెప్పింది. పట్టపురాజు అప్రకారమే చేసి, మానుముక్కకు తుదా మొదలూ సరిగా చెప్పగా పొరుగురాజు మారుమాటాడలేకపోయాడు.

కాని, ఎలాఐనా ఓడించాలనే పట్టుదలతో పొరుగురాజు 'ముచ్చ మువ్మారు అన్నారు పెద్దలు. కనుక మరొక సమస్య కూడా మీరు పరిష్కరించితీరాలి. అప్పుడే మీరు గెలిచినట్టు, లేకుంటే లేదు 'అంటూ ఈసారి ఒక భయంకరమైన మంత్ర బాణాన్ని కోటగోడకు సంధించి కొట్టాడు. దెబ్బతో భూకంపం వచ్చినట్టుగా, కోట పునాదులలోకంటా కదిలిపోయింది. 'ఈ బాణాన్ని ఊడదీయాలి, లేదా ఓడిపోయినట్టే" అని సవాలుచేశాడు పొరుగురాజు.

పట్టపురాజు ఇంతటితో తనపని సరే నని తలచి కంగారుపడ్డాడు. ఆ బాణం ఊడతీయగలవాడికి అర్ధరాజ్యమూ, కుమార్తెనూ ఇస్తానని చాటింపు వేయించాడు. ఎవరూ ముందుకు రాలేదు. ఇందుకల్లా

సమర్థుడు కన్నప్ప ఒక్కడేనని రాజ కుమారికి తెలుసు. ఈమంత్ర బాణాన్ని గురించిఆమె కన్నప్పతో చెప్పేసరికి, గుండె నిబ్బరంగల కన్నప్ప 'ఓస్, ఈపాటిదాని కేనా కంగారు!" అంటూ, ఆమె చెవిలో ఏదో రహస్యం చెప్పాడు.

వెంటనే ఆమె తండ్రివద్దకుపోయి "నాయనా, నాకు రాత్రి ఒక కలవచ్చింది. నీవు కన్నప్పను కట్టెప్పించిన రాతి స్తంభంలోపల ఒక వీరుడున్నాడట. పారుగురాజు సంధించిన బాణం తిప్పటా నికి అతడే సమర్థుడట" అని చెప్పింది.

ఈమాట చెవినిపడగానే కన్నప్ప సంగతే మరచిపోయిన పట్టపురాజు 'ఆ స్తంభం పడగొట్టించండి' అని భటులకు ఆజ్ఞాపించాడు. ఆలాచేయగా, అందులో నించి నిజంగానే ఒక వీరుడు ఉత్సాహంతో బయటకు వచ్చాడు. ఆ వీరుడు ఒక్క సారి కళ్ళుమూసి మంత్రం జపించుకొని అవలీలగా బాణాన్ని లాగివేసి, తిరుగా దాన్ని పారుగురాజు కోటగోడకు సంధించి కొట్టాడు. ఈ ప్రయోగంతో ఒక గొప్ప సమర్థుడు పట్టపురాజు ఆస్థానంలోఉన్నట్టు పారుగురాజుకు విశదమైంది.



అప్పుడు పారుగురాజు 'మీ ఆస్థానంలో ఉన్నవాడు అసాధ్యుడిలా కనపడుతు న్నాడు. అటువంటి ప్రజ్ఞావంతుణ్ణి కళ్లార చూడటానికి ఉవ్విళ్లూరుతున్నాము, కనుక, మా కుతూహలం తీర్చవలసింది' అని కబురు చేశాడు. ఈ సంగతి పట్టపు రాజు కన్నప్పతో చెప్పగానే 'ఆలాగేచేదాం తమ అనుజ్ఞఐతే వెళ్ళివస్తా'నన్నాడు. అన్నాడేకాని, పారుగు రాజుయొక్క దుష్ట స్వభావం ఏనాడో గ్రహించిన కన్నప్ప తగిన జాగ్రత్తతోనే బయల్దేరాడు.

కన్నప్ప సరిగా తన మోస్తరుగానే దుస్తులు వేసుకొన్న మరికొందరు యోధు

లను వెంటబెట్టుకు వెళ్ళేసరికి, అందులో తనకు కావలసిన యోధుడెవడో కనిపెట్టడం పొరుగురాజుకి అసాధ్యమైంది. ఎలాఐనా తన తెలివితేటలవలన కనిపెట్టాలినని ఎన్నో పన్నాగాలు పన్నాడు. కాని, ఎప్పటికప్పుడే యుక్తిపరుడైన కన్నప్ప పొరుగురాజు దురుద్దేశం గ్రహించి, అతని వ్యూహాలనుండి తప్పించుకు రాగలిగాడు.

చేసేదిలేక చివరకు పొరుగురాజు "మీలో ప్రజ్ఞావంతుడు ఒకడున్నాడని నాకు తెలుసు. ఆ బుద్ధిశాలి ముందుకు వచ్చి నేను ఈయబోయే బహుమానం అందుకోవలసింది" అని వేడుకొన్నట్టు నటించాడు.

ఆ యోధుల గుంపులోనించి అప్పుడు కన్నప్ప ఇవతలకు వచ్చి రాజుముందు నిలబడేసరికల్లా, దుష్టచింతతో ఉన్నరాజు అమాటా ఈమాటా చెబుతూ, కత్తిదూసి కన్నప్పమీదికి విసరబోయాడు. కాని, ఆవేశంలో తడబాటువల్ల రాజు కాలుజారి కత్తి కిందపడింది. మొదటినుంచీ ఈ వాలకమంతా కనిపెడుతూనే వున్న కన్నప్ప చటుక్కున ఆకత్తి దొరకపుచ్చుకొని, దుర్మార్గుడైన పొరుగురాజును కసుక్కున పీక తెగవేశాడు.

అతనితలను కత్తిమొనకు గుచ్చి తీసుకవెళ్ళి, కన్నప్ప తనరాజుకు బహుమానం చేశాడు. కన్నప్ప ధైర్యసాహసాలకూ, సమయోచితానికీ, బుద్ధిబలానికీ ఎంతగానో మెచ్చుకున్నాడు పట్టపురాజు. కన్నప్ప, కలను దాచిన కారణం రాజకుమారి తండ్రికి వివరిస్తూ అతనిని తను కాపాడిన విధం అంతా పూసగుచ్చినట్లు చెప్పేసరికి, రాజు ఆశ్చర్యపోయాడు.

వాగ్దానం ప్రకారం రాజు కన్నప్పకు అర్ధరాజ్యంతోకూడా రాజకుమారినిచ్చి పెళ్ళి చేయగా, వాళ్ళు సుఖంగా వున్నారు.





# కపిలగోవు

పూర్వకాలమందు సుధాముడు, చిత్రకేతుడు అని యిద్దరు సోదరు లుండేవారు. ఒకప్పుడు వాళ్లు దేశాటనం బయల్దేరారు. ఒక మర్రిచెట్టువద్దకు వచ్చేసరికి రెండు బాటలు కనపడగా, చెరివక దారిని పో నిశ్చయించుకొని, ఇల్లు చేరుకునేముందు ఇక్కడనే కలుసుకుందా మనుకున్నారు.

సుధాముడు రెండు కుక్కలతో సహా అనేకమైన అరణ్యాలు దాటి, ఒక పెద్ద పర్వతం కనపడగా అది యెక్కాడు. దాని పైన ఎన్నో కుండలు బోర్లించివున్నై. ఆత్రంతో అతను మొదటికుండను ఎత్తి చూచాడు. దానికింద ఏమీ కనిపించలేదు. మళ్లా ఎప్పటిలాగా పెట్టబోమని యత్నించేసరికి టపీమని బద్దలైపోయింది, ఎన్ని తీసినా అన్నీ అలానే పగిలిపోయినై.

చివరకు సుధాముడు చిట్టచివరికుండ పట్టి ఎత్తేసరికి, అందులోనించి ఒక చిత్రమైన మనిషి లేచివచ్చాడు. వాని శరీరమంతా మానవరూపమే కాని, కుడికాలు మాత్రం చెట్టుమానులాగా వున్నది. వాడు సుధాముణ్ణి చూచి కోపంగా "ఓరి దుర్మార్గుడా!—నే నెంతోకాలంనించి కష్టపడి తయారు చేసుకొన్న ఇన్ని కుండలను ఒక్కసారిగా పగలగొట్టేస్తివి. ఈ కుండలు తయారుచేసేమన్ను ఇక్కడికి పదికోసుల దూరాన కళింగ మడుగులో తప్ప మరెక్కడా దొరకదు. కనుక, నన్ను వీపుమీద ఎక్కించుకొని అక్కడకు మోసుకుపో. నీకిదే శిక్ష" అని గర్జించాడు.

సుధాముడు బెదరిపోక, నిదానంగా ఆలోచించాడు. 'ఈకాలులో ఏదో రహస్యం ఉండాలి. కనుక వీనితో కయ్యంపెట్టుకోకూడదు' అని నిశ్చయించాడు.

ఆ మాయమనిషి ఎదట వినయంగా నించుని, "బాబాయ్!—ఇటువంటి చిత్ర

ఏ. నరసరాజు, భీమవరం.



మైన కుండలు మాదేశంలో చూచి ఎరగము. అందుచేత, చోద్యం చూదామనే సరదాతో వాటిని నేను ఎత్తినమాట వాస్తవం. అందుకని నేనే కళింగ మడుగునకు పోయి నీకు కావలసినంతమట్టి తీసుక వస్తాను. ఈపాటిదానికే నువ్వు శ్రమపడి స్వయంగా రావాలా?" అని నమ్మబలికి, మాయమనిషిని ఒక చెట్టుకింద స్తిమితంగా కూర్చోమని, సుధాముడు బయల్దేరాడు.

కుక్కలతోసహా సుధాముడు పోయి పోయి ఒక కొండగుహ చేరుకున్నాడు. ఆ మాయమనిషి తనను దెబ్బతీయటానికి తప్పక వస్తాడని సుధామునికి తెలుసు. కనుక, ఆగుహలో స్థావరం ఏర్పరచుకొని, రకరకాల మారణ సాధనాలు తయారు చేయ నారంభించాడు.

నాలుగవరోజున భూమి దద్దరిల్లేటట్టు పెద్దశబ్దం వినబడింది. అంతలోనే మాయమనిషి కేకలు వినపడగా, కంఠస్వరం గుర్తుపట్టి, వెంటనే సుధాముడు కుక్కలను ఉసుకొలిపి వదిలాడు.

భయంకరమైన కుక్కలు రెండూ కొండదిగి, మాయమనిషిపై ఎగబడగా పైన గుహలోనించి సుధాముడు తయారు చేసి వుంచిన మారణ సాధనాలను శరవేగంతో వానిపైకి వదిలాడు. మాయమనిషికి శరీరబలమైతే ఉన్నదికాని, ఒక్క పరికరమైనా చేతిలో లేకపోవటంచేత, సుధాముని దెబ్బలకు బదులు ప్రయోగించలేకపోయాడు. కింద కుక్కల హింసలు, పైన సుధాముని దెబ్బలూ మిక్కుటమై వాడు తట్టుకోలేక, కొంచెం సేపటికల్లా గిలగిల తన్నుకొని ప్రాణాలు విడిచేశాడు.

వాని కళేబరమంతా ఆ కుక్కలు నిమిషంలో కబళించివేసినై. కాని మానుకాలు మాత్రం వాటికి కొరకబడక అలానే మిగిలిపోయింది.

ఇప్పుడు సుధాముడు విజయగర్వంతో కొంద దిగివచ్చి శత్రుశేషం వుంచకూడ దనే వుద్దేశంతోనూ ఈ మానుకాలులో ఏదో మర్మం వుండితీరాలి, చూతామనే కుతూహలంతోనూ ఒక గొడ్డలితో నెమ్మ దిగా ఆ కాలును పగులగొట్టాడు.

పగులులోనించి ఒక్కొక్కటిగా కొన్ని వందల ఆవులు బయటికి వచ్చినై. ఆ ఆవులమంద చూచి సుధాముడు ఆశ్చర్య భరితుడైనాడు. మందలోకల్లా ముచ్చటైన కపిల గోవును చూచేసరికి అతని ఆనందా నికి మేరలేకపోయింది. ఆ కపిల గోవు తోక ఆడించుకొంటూ సుధాముడి దగ్గరకు వచ్చేవరకు అతను ఎంతో మక్కువపడి దానిని పంచ ప్రాణాలలో ఒక ప్రాణంగా ఎంచుకొన్నాడు.

ఇప్పుడీ గోవులమంద లభించటం గొప్ప భాగ్యంగా తలచి, సుధాముడు ఇంటికి పోదామని బయల్దేరాడు. అతను మొదట విడిచిపెట్టిన మఱ్ఱి చెట్టు చేరుకొనేసరికి, అప్పటి కప్పుడే చిత్రకేతుడు అన్నకోసం నిరీక్షిస్తున్నాడు. చూచీ చూడటంతోనే అతని కన్నులు కపిలగోవుమీద పడినై. ఏవిధంగా దాన్ని కాజేయటమా అని



చిత్రకేతుని మనస్సు అనేక ఉపాయాలు వెదుకజొచ్చింది.

అన్నాదమ్ము లిద్దరూ మఱ్ఱిచెట్టుకింద బావి ఒడ్డున కూర్చుని వారు చూచి వచ్చిన వింతలూ, విశేషాలూ చెప్పుకొంటూ వుండగా సుకుమారుడైన సుధామునికి బడ లికవల్ల వెంటనే నిద్రపట్టేసింది. ఆవు మీదనే దృష్టి పెట్టుకున్న చిత్రకేతునికి కన్ను పొడుచుకున్నా కునుకుపట్టలేదు.

చిత్రకేతుని హృదయంలో దుష్టబుద్ధి ప్రవేశించటంచేత చివరకు అతను అదను చూచి, గాఢనిద్రలోవున్న అన్నను ఆ లోతు బావిలోకి తోసివేసి, ఆవులమందను ఇంటికి

తోలుకొని పోబోయాడు. మంద అంతా అతనివెంట పడింది కాని, కపిలగోవు మాత్రం కదలిందికాదు. తన రక్షకుడైన సుధాముడు కనపడక అది కన్నీరు కార్చుతూ, అలానే నించుంది. ఎంత బెదరించినా, అది చిత్రకేతునివెంట పొలేదు.

చిత్రకేతుడు ఇంటికి చేరుకొనే సరికల్లా అతనిని అందరూ చుట్టివేసి సుధాముని గురించి ఆత్రంతో ప్రశ్నించారు. కాని, చిత్రకేతుడు ఏవో అనేసి తప్పించుకొన్నాడు.

చిత్రకేతుడు నవుకర్లనుపంపి, 'ఫలానా బావివద్ద ఉన్న కపిల గోవును కట్టి తీసుకరమ్మన్నాడు. వాళ్ళు పగ్గాలు పట్టుకపోయి దానిని బలవంతాన కట్టబోయేటప్పటికి, అది బావివేపు లాగజొచ్చింది. దాని అడావిడిచూచి భటులు నూతిలో చూచారు. కొట్టుమిట్టాడుతూవున్న సుధాముడు అందులో కనపడగా, తక్షణమే వారు బావిలోనుంచి అతన్ని పైకి తీశారు.

అప్పుడు నవుకర్లు, కపిలగోవుతోసహా తమ యజమానియైన సుధాముణ్ణి ఇంటికి తీసుకవెళ్ళి, ఈ సందర్భమంతా చెప్పేవరకు, అందరూ చిత్రకేతుని దుర్మార్గానికి అతన్ని అనేకవిధాల నిందించారు. ఇంతలో అన్న వస్తున్నసంగతి తెలుసుకొని చిత్రకేతుడు పరారీ ఐపోయాడు. సుధాముడు నవుకర్లను దేశదేశాలకు పంపించి, పట్టుదలతో తమ్ముణ్ణి వెతికి రప్పించాడు.

ఇంటికి చేరుకొన్న చిత్రకేతుడు, అన్న ఏమి చేసిపోతాడోనని భయంతో యెదట నిలబడేసరికి, సుధాముడు అతనిని చేరదీసుకొని, "తమ్ముడూ!—నీకు కావలెనంటే కపిల గోవు ఒక్కటేకాదు, మందనంతటినీ ఇచ్చేవాడినేకదా? దీనికోసం ఎందుకు ఇంత శ్రమపడటం? ..." అనేటప్పటికి చిత్రకేతుని కన్నులవెంట బాష్పధారలు కురిసినై. 'క్షమింపు' మంటూ అతను అన్న పాదాలపైన పడ్డాడు.



## కోడి అస్తమానం నేల కెలుకుతూ వుంటుంది

# ఎందుకో తెలుసా?



పూర్వకాలమందు గ్రద్దకు ఇప్పటిలాగ రెక్కలు ఉండేవి కావు. అందు చేత అది ఎగురలేక పోయేది. జంతువులతోపాటు అదికూడా భూమిమీదనే సంచరించవలసి రావటం దానికి ఇబ్బందిగా తోచింది.

అప్పుడు గ్రద్ద ఘోరమైన తపస్సు చేసి పరమేశ్వరుణ్ని ప్రత్యక్షం చేసుకుని ఆయనకు నమస్కరిస్తూ, "దేవా! నేను ఈ భూలోకంలో మాత్రమే సంచరించటం స్వేచ్ఛకు లోపంగా వున్నది. కనుక ఆకాశ మార్గాన విహరించటానికి వీలుగా రెక్కలు అనుగ్రహించి, పుణ్యం కట్టుకోవలసింది" అని వేడుకుంది.

గ్రద్ద ప్రార్థన విని దేవుడు, ఒక మహిమగల సూదిని దానికి ప్రసాదిస్తూ "ఓయి గ్రద్దా!—నీకు ఇష్టమైన రెక్కలూ, ఈకలూ సంపాదించి తెచ్చుకుని, ఈ సూదితో కుట్టుకున్నావంటె శాశ్వతంగా అతుక్కుపోతై. అప్పుడు తక్కిన అన్ని పక్షులలాగా నీవుకూడా స్వేచ్ఛగా ఆకాశమార్గాన ఎగురగల్గుతావు" అనిచెప్పి, అదృశ్యమయ్యాడు.

దేవుడిచ్చిన మంత్రసూదితో గ్రద్ద రెక్కలూ ఈకలూ అమర్చుకుని ఇష్టంవచ్చినట్టుగా ఎగురజొచ్చింది. గ్రద్ద ఎగరటంచూచి, దాని ప్రాణస్నేహితుడైన కోడికికూడా ఆకాశమార్గాన ఎగురాలని సరదాపుట్టింది. గ్రద్ద దగ్గరకు వెళ్ళి కోడి, తనకు కలిగిన అభిలాషను వెల్లడించింది.

ఈసంగతి విని గ్రద్ద "వోయి నేస్తం!—ఈ మంత్రసూదిని నేను కఠోరమైన తపస్సు చేసి సంపాదించుకుని ప్రాణసమానంగా చూచుకొంటున్నాను. కనుక, ఇదితప్ప మరేమికోరినా తప్పక నీకోరిక నెరవేరుస్తాను. నా ప్రాణాలు

* ఈ నెల బహుమతి పొందిన కథ. — ఆర్. మాణిక్యాంబ, సైదాపేట

కోరినా ఇవ్వటానికి సిద్ధమే" అని నమ్మబల్కింది.

అందుకు కోడి "నాకు జీవితంలో మిగిలివున్న కోరిక ఇది ఒక్కటే. నీ దయవుంటే మిత్రుని కోరిక నెరవేర్చు. లేకుంటే లేదు. నీవు మాట చెల్లిస్తావనే గట్టి నమ్మకతో ఇంతదూరం వచ్చాను. నోరు తెరిచి అడిగాను. ఒక్క నాలుగు రోజులు సూది ఎరువిచ్చావంటే రెక్కలు అమర్చుకొన్న వెంటనే నీసూది నీకు పువ్వులలో పెట్టి వప్పగిస్తాను" అని అనేకవిధాల ప్రాధేయ పడింది.

మారుమాట చెప్పలేక గ్రద్ద మంత్ర సూది ఇస్తూ అనేకవిధాల హెచ్చరిక చేసింది. అమిత సంతోషంతో కోడి మంత్ర సూది పట్టుకపోయింది కాని, ఆ ఉత్సాహంలో దారిలో ఎక్కడో దానిని జారవిడిచింది. ఆ క్షణం నించీ కోడికి మతిపోయి, ప్రాణస్నేహితుడైన గ్రద్దకు ఏం సమాధానం చెప్పుకోటానికీ తోచలేదు.

సరీగా నాలుగో రోజున గ్రద్ద తన మంత్ర సూదికోసం కబురుచేసేసరికి, కోడి 'ఇదుగో ఇస్తాను, అదుగో' ఇస్తాను, అంటూ గడువు పెట్టి, ఆ సూది దొరుకుతుందేమోనని నాటికీ నేటికి కుటుంబంతో సహా భూమి కెలుకుతూ, ఇంకా వెతుకుతూనేవుంది.

కోడి తనను మోసంచేసి, మంత్ర సూది కాజేసి, ఇలా నటన చేస్తూ వుందనే అపోహతో, గ్రద్ద దాని జట్టు విప్పేసి, దానిపైన వైరం పూనింది. అప్పటినించీ కోళ్లుగాని, కోడిపిల్లలుకాని కంటబడితే, గ్రద్ద వాటిని ఆకాశానికి ఎగరేసుకుపోయి, కసితీరేట్టు కబళించి వేయాలని చూస్తుంటుంది.



# చందమామ బొమ్మల పజిలు





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## ఆహారము: ఫలములు

క్రిందటిసారి తల్లిపాల ప్రాముఖ్యతను గురించి చెప్పానుకదా!—పిల్లలకూ పెద్దలకూ పాల తరవాత ముఖ్యమైన ఆహారం ఫలాలు. నిజానికి, ఫలముల ఆహారపు విలువ ఇటువంటిదీ అని మాటలతో చెప్పటానికి వీలే కాదన్నమాట.

ఫలములు మన ప్రేగులలో ప్రవేశించగానే జీర్ణశక్తికి తోడ్పడే ఒకవిధమైన సూక్ష్మ జీవులు బయల్దేరుతై. వీటివల్ల శరీరానికి ఎంతగానో మేలుకలుగుతుంది. రెండవది—నిమ్మజాతికి చెందిన ఫలాలు అనగా కమలా, నారింజ, బత్తాయి, మొదలైనవన్నీ రక్తాన్ని సరియైన క్రమంలో ఉంచుతవి. ఘాటు పదార్థాలవల్ల జీర్ణకోశాలకు కలిగే రాపిడిని తగ్గించి, సాదుపరిచే సుగుణం ఫలరసాలలో వున్నది. పైగా, బిడ్డలకు రేచనం సాఫీచేసే చక్కటి గుణంకూడా ఫలాలలో వున్నది. అందుకనే ఫలరసాలు పిల్లలకు ఎంత తరుచుగా ఇస్తూవుంటే అంతమంచిదీ అంటాను.

ఫలములు కొనటానికి చాలా ఖర్చు అవుతుంవి. ఐనాసరే, అవకాశం కల్పించుకుని, వీలున్నప్పుడెల్లా పళ్లు తినటం చాలా అగత్యం. ద్రాక్ష, దానిమ్మ, మామిడి, అనాస, బొప్పాయి—మొదలైనవి దొరకినంతవరకు ఆరగించవలసిందే. ఒక్కొక్క ఫలంలో ఒక్కొక్క విశేషం ఉన్నది. అటువంటప్పుడు పుష్కలంగా ఫలముల ఆహారం లభించితే ఎంతటి అదృష్టం!

ఫలముల ఆహారంలో ఇంతటి మహత్తరమైన విశేషాలు ఉండబట్టే, మన మహర్షులందరూ ఫలములు తిని, చిరంజీవులై, ఎంతో ఆరోగ్యవంతంగా ఉండేవారట. ఫలముల ఆహారంవల్ల శరీరానికి తుష్టి పుష్టి కల్గుతుంవి. అనేక వ్యాధులు నివారణమవుతై. కనుకనే ఫలముల ఆహారం పసందైనదే కాకుండా పవిత్రమైంది కూడాను.

'మీ పెద్దమ్మ'

| | | | | |
|---|---|---|---|---|
| 1 | | | | — — —<br>= పిశాచము |
| 2 | | | | — — —<br>= దీనితో నీళ్ళు తోడుతారు |
| 3 | | | | — — —<br>= శకుంతల తల్లి |
| 4 | | | | — — —<br>= ఆశీర్వాదము |

పైన 1, 2, 3, 4 అంకెలూ, వాటికెదురుగా మూడేసి బొమ్మలూ వున్నవికదూ? 1-వనెంబరుకు ఎదురుగావున్న మూడు బొమ్మలు ఏమిటో గ్రహించి, క్రింద మీరు గ్రహించిన మాట రాయాలి. అదేవిధంగా 2, 3, 4. అంకెలకు ఎదురుగావున్న బొమ్మల క్రిందకూడా మాటలు వ్రాయాలి. తర్వాత ఒక్కొక్క నెంబరుకు ఎదురుగా వ్రాసిన ప్రతి మాటలోని మొదటి అక్షరం తీసి, వరుసగా చివరి గడిలో వ్రాయాలి. ఆ మూడు అక్షరాలు కలిపి చదివితే చివరి గడిలో ఇచ్చిన అర్థంవచ్చేమాట వస్తుంది. మీకు తెలియకపోతే జవాబుకి 56-వ పేజీ చూడండి.




ఈ ట్రిక్కు ఎలా సాధ్యమా అని మీరు మొట్టమొదట చాల ఆలోచనలో పడతారు. తీరా తెలుసుకున్న తర్వాత 'ఓస్, ఇంతేనా' అని ఆశ్చర్యపోతారు.

మొట్టమొదట పేకలోంచి కళావరు మూడు, ఇస్పేటు మూడు, ఆటీను మూడు, డైమను మూడు, ఈ నాలుగు ముక్కలూ తీసుకో. ఈ నాలుగు ముక్కలూ కాక, అంకెలు ఏమీ లేకుండా ఖాళీగావుండే మరొకముక్క తీసుకో. తర్వాత, కళావరు, ఇస్పేటు, డైమను ముక్కలలో కిందవున్న మూడోచుక్కా, ఆచుక్కకి మూలనున్న అంకె గుర్తూ లేకుండాచెయ్యాలి. చాకుతో గానీ, బ్లేడుతోగానీ పేకముక్క చిరిగి పోకుండా గుర్తుమాత్రం చెరిగిపోయేట్టు చెయ్యవచ్చు. నాలుగోముక్క (ఆటీను మూడు) మాత్రం అలాగే వుంచాలి. ఇలా తయారుచేసుకున్న పేకముక్కలు ఎలా వుండాలో ప్రక్క బొమ్మలో చూపబడింది.

తర్వాత ఈ నాలుగు ముక్కల్నీ పక్క పేజీలో చూపినవిధంగా విసనకర్ర ఆకారంగా పట్టుకొని ప్రేక్షకులకు చూపాలి. పైన కనిపిస్తున్న ఆటీను మూడు చూచి దాని అడుగున వున్నవికూడా మిగతా













రంగుల మూళ్ళే అని ప్రేక్షకులు అనుకుంటారు. అప్పుడు నువ్వు — "ఇదుగో చూడండి, ఈ ముక్కలమీద వున్న అంకెలన్నీ మాయంచేసి తెల్లగా చేసేస్తాను'

## అంకెలున్న పేకముక్కల్ని తెల్లగా చెయ్యటం

అంటూ నీదగ్గిర అంకెలులేకుండావున్న కాళీముక్క తీసుకుని మిగతా మూడు



ముక్కలపైనవుంచి, క్రిందచూపినవిధంగా విసనకర్ర ఆకారంలో పట్టుకొని ప్రేక్షకులకు చూపాలి. చాకుతో చెరిపి, తెల్లగా చేసిన భాగంమాత్రం కనిపించేటట్టూ గుర్తులున్న మిగతాభాగం కనిపించకుండా వుండేట్టూ ముక్కల్ని పట్టుకోవటంలోనే వున్నది కిటుకు. కొంచెం జాగ్రత్త అవసరం



సభకివచ్చేముందు ఇంటి దగ్గిరేఈ ముక్కల్ని యిలా తయారుచేసి తెచ్చుకోవాలి.

[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—
ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

# "రెంటికి చెడిన........"

పలనాట నొక చిన్న పల్లెటూరుండా
పల్లెలో 'వాకలి పుల్లడు'న్నాడు.

ప్రొద్దున్నె యొకనాడు సద్ది భోంచేసి
గాడిదను దోలుకొని గంగకెళ్ళాడు.

మడి బట్టలను ముందు పిడిసి విదిలించి
దూరాన గట్టుపై ఆరవేశాడు.

నీరు కాయలు, ముందు నీటిలో ముంచి
గంజిలో జాడించి గుంజుతున్నాడు.

చూస్తుండగనె పెద్ద సుడిగాలి వచ్చి
మడిబట్టలను ముందు తుడుచుకెళ్లింది.

గుంజేటి బట్టల్ని బండపై వదలి
పుల్లప్ప గాలితో పరుగులెత్తాడు.

గాలిపటముకు మల్లె గగనాని కెగిరి
మడిబట్టలన్నీని మాయమైనాయి.

మాటలో నా యేరు పోటు పొడిచింది
గబ గబా పుల్లప్ప కంగారు పడుతు

యేటిలో బట్టల్ని వెదకబోయేసరికి
బట్టలా యేటిలో కొట్టుకెళ్ళాయి.

"మంప గాలికి బోయె మడి బట్టలన్ని
నీరుకాయులు బోయె నీటిలో గలసి.

'రెంటకిని చెడినట్టి రేవడి" నటంచు
"గొల్లు"మని పుల్లప్ప కూలిపోయాడు.

రచన · కవిరావు



ఎస్. సుశీల, రాణిబెన్నూరు

# వినోద చదరం




క్రింద చూపబడిన ఆధారముల సహాయంతో ప్రక్క చదరం పూర్తిచేయాలి. ప్రతిమాటలో మొదటి అక్షరాలన్నీ ఒకటే. అలాగే చివరి అక్షరాలన్నీ ఒకటే. ఆధారాలు యివి:—

1. సర్పము; 2. వంట; 3. చెట్టు; 4. ఒక పుష్పము; 5. కళ్యాణము

మీరు పూర్తిచెయ్యలేకపోతే జవాబుకి 56-వ పేజి చూడండి.




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (సెప్టంబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

### వినోదచదరం జవాబు:

| | | | | | |
|---|---|---|---|---|---|
| పా | ము | | | | |
| పా | క | ము | | | |
| పా | ద | ప | ము | | |
| పా | రి | జా | త | ము | |
| పా | ణి | గ్ర | హ | ణ | ము |

### 51—వ పేజీలోని బొమ్మలకి జవాబు:

1. భూధరము; తలుపులు; ముని
= భూతము

2. ఏనుగ; తరంగములు; ముల్లంగి
= ఏతము

3. మేజా; నది; కన్ను = మేనక

4. దీపము; వరాహము; నమస్కారము
= దీవన

### 49-వ పేజీలోని బొమ్మల పజిలుకి జవాబు:

| అడ్డము: | నిలువు: |
|---|---|
| 3. అరు; 4. రవి; | 1. తేరు; 2. పార; |
| 6. ఆకు; 7. నావ; | 3. ఆకుచిలుక; |
| 8. చిప్ప; 9. లోయ; | 5. వినాయకుడు; |
| 10. డోలు; 11. కుక్క | 13. పిడి; |
| 12. కపి; 14. గూడు. | 14. గూని. |

## "ఎందుకో తెలుసా?"

●

"కోడి అస్తమానం నేల కెలుకుతూ వుంటుంది. ఎందుకో తెలుసా?" అనే దాన్ని గురించి మాకు వచ్చిన కథలలో కెల్లా ఉత్తమంగా తోచిన కథ ఈ సంచికలో వేశాం. ఈకథ వ్రాసినది ఆర్. మాణిక్యాంబ, సైదాపేట. ఈమెకు బహుమానంగా ఆగస్టు '50 నుండి డిసెంబరు '50 వరకు 'చందమామ' ఉచితంగా పంపుతున్నాం.

వచ్చేనెల (సెప్టెంబరుకు)

'గరుడపక్షి పామును కబళించి వేస్తుంది' ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీకు తెలిసిన కథ వ్రాసి పంపండి. మాకు చేరిన వాటిలో ఉత్తమంగా వున్నదానికి బహుమతి ఇస్తాం. కథలు మాకు ఆగస్టు 15-వ తేదిలోగా చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"
చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు 1686, మదరాసు-1

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras.

